# AYAPRABHAVAM.

## ఆయ ప్రభవము



S B. Sunkaram.

Managing Director,

The Kristna Jute & Cotton Mills Company Ltd.

Ellore

# అయః ప్రభావము



సోమంచి భీమశంకరము.

డైరక్టరు

క్రిష్ణా జూటు అండు కాటన్ మిల్సు కంపెనీ,

ఏలూరు

1905

*Price Rs. 1-0-0* వెల రు 1-0-0

## *DEDICATION.*

క్షణమొక్క యుగముగా పొద్దుపోక హంసతూలికా తల్పములపై నిటునటు పొరలాడుచు దుప్పటిమడత గ్రుచ్చు కొనెనని తైలాముల మర్దనల చేయించుకొను వారిజీవనముల కాధారమగుసకలవస్తుచయమును చేసిసమర్పించుటకై చమటయూడ్చిచాకిరిచేయు కాయలుగాసిన చేతులకును దేశాభిమానులు చేయు నుపదేశములయొక్క యుసత్కార్యములయొక్కయు సారమునుపుణ్యపాపములెఱుగని ప్రజలగ్రహింపనీక రసభరితమగు చెఱకునకు దట్టముగపైకెక్కియుండుపిప్పివలె లోకోపకార కార్యములకువిఘ్నము లొనర్చు ప్రబుద్ధులకును నీగ్రంథ మంకిత మొనర్పఁబడినది.



# పీఠిక.





ఈగ్రంథము విద్యాపారీణ్యతఁగనపఱచుటకుగాని సాహిత్యజ్ఞాన మెక్కువచేయుటకుగాని వ్రాయఁబడినదిగాదు. కాలచక్రము తిరిగిరానురానుగలుగుచున్నమార్పులననుసరించి యిప్పుడు దేశాభివృద్ధికై పలువిధములైన కృషుల కాధారములగుయంత్రశాలలు దేశమందంతటను స్థాపించవలసిన యవసరముకలిగినది. అందువిషయమై దేశాభిమానులగు విద్యార్థులు పలుమార్గముల పనిచేయుచున్నారు. వారెంతయభిమానముతోడను, పూనికతోడను పనిచేయుచున్నను వారిప్రయత్నములు సార్థకములుగావలెనన్న ననేకవిధములగు వృత్తులు చేయుచున్న పనివాండ్రకును, వారికిపోషకులుగానుండిన వర్తకులకును, యంత్రశాలాదుల మహిమ తెలియజేయవలయును. అందులకై యీగ్రంథమురచింపబడినది. యంత్రములనుగూర్చిగ్రంథములు వ్రాయకముందు జనసామాన్యమునకు యంత్రశాలలయొక్కయు జాయింటుస్టాకు కంపెనీలయొక్కయు నవసరముకానుపించి వానియందురుచిపుట్టవలయును. అట్లభిరుచిపుట్టించుటకు మృదుమధురశైలితో ఇంగ్లీషుభాషయందు గ్లీ బార్లోవారగారొక గ్రంథమును వ్రాసియున్నారు

కాని యట్టి గ్రంథము దేశభాషల యందెక్కడనున్నట్లుతోచదు ఈ గ్రంథమునందలి ముఖ్యాంశములు కొన్ని వారి గ్రంథమునుచదివియే గ్రహింపఁబడినవి. అందుచే వారికి కృతజ్ఞతాసూచకవందనములందిచ్చుచున్నాడను.

ఏయుద్దేశముతో నీపొత్తముచ్ఛాత్తించబడినదో యది కొనసాఁగి దీనింజదువుటకు ఫలముగా జాయింటుస్టాకుకంపెనీలు వృద్ధియై పలువిధములగు యంత్రశాలలాంధ్రదేశమందు వెలసిన సంకల్పసిద్ధుఁడనయ్యెద.

ఇట్లు విధేయుడు,

సో. భీ. శం.



# అయఃప్రభావము.

## శుద్ధపత్రిక.

---

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 12 | చ్కగ | చక్కగ |
| 7 | 5 | గనపడరు | గనుపడరు. |
| 12 | 15 | ఉవ్న | ఉన్న |
| 18 | 20 | యిచ్చటి | యచ్చటి |
| 21 | 10 | కష్టమునని | కష్టమునను |
| 39 | 2 | రొమ్కుడు | రొక్కుడు. |
| 53 | 10 | భించుట | బించుట |
| 53 | 15 | నత్యము | సత్యము |
| 62 | 21 | బవర్న | గవర్న |
| 75 | 12 | దొరలు | దొరల |
| 75 | 20 | వృద్ధియ్సా | వృద్ధియు |
| 75 | 21 | ఎకిబిషను | ఎగ్జిబిషను |
| 87 | 6 | పారశీకు | పారశీ |
| 86 | 21 | జీరొమహాతా | జీమొహాతో |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 87 | 7 | నుండిన | యుండిన |
| 90 | 13 | సాదించు | సాధించు |
| 93 | 5 | లందగుకూడ | లందుకూడ |
| 93 | 18 | 1 01 | 1901 |
| 96 | 9·10 | నటి | నట్టి |
| 96 | 14 | మని | మను |
| 99 | 7 | మట్లును | మిట్లను |
| 99 | 7 | తాప | తానుప |
| 99 | 8 | చేయుంచుడ | చేయుచుండ |
| 103 | 6 | వస్తువులను | వస్త్రములను |
| 106 | 9 | యూరేపి | యూకేషి |
| 113 | 18 | బాలిష్టు | బాధిష్టు |
| 114 | 1 | ప్రతిష్ఠ | ప్రతిష్ఠా |

---

# INTRODUCTION.

## ఉపోద్ఘాతము

---

చ. కరితురగాదిఘట్టనయు గాలియు నోంపదె యొంటినున్న యు
త్తరువు ననేక భూరుహ వితానము గుంపయి యున్న బాధలన్
బొరయునె యన్నదమ్ములను బొందినయేరికసాధ్యులెల్లగా
కరవయినిల్చినన్ గెలని కల్గినమైపడిపోదు కౌంతియున్ ॥

భారతము.



ఒక్క దేశమున జన్మించి యొక్క వేదమును నమ్మి యేకకుటుంబముగ నుండిన మనలో కాలక్రమమున నైకమత్యము చెడి హిందూవంశవృక్షమునకు శాఖోపశాఖలేర్పడి యాశాఖలు చిన్నకొమ్మలుగను, కొమ్మల నుండి రెమ్మలుగను, రెమ్మలనుండి యీనెలుగను, పగిలిపోయి, యన్నిటిజీవనమునకును మూలాధారమగు తల్లివేరునకుదూరమై యేకగర్భజనితులను సవతిబిడ్డలకన్న నన్యులుగ జ్ఞానహీనతచే చూచుచుండుకాలము పలువిధములగు హేతువులచే సంప్రాప్తమైననాటినుండి యైకమత్యమను గంగ యీయుత్తమగుణమునకు దోహదమును కృషియును లేకుండుట వలన నది యడుగంటుటయే గాక బీడు పడిన భూమియందు కలుపు మొలచినటులనె వృద్ధికి భంగకరములగు ననేక

దుర్గుణములు మనలో సంచరించి పెరుగనారంభించినవి. అందువలన కలిగిన నష్టములన్నిటికన్న నెక్కువదిగా దరిద్రదేవత దేశమునావహించినది.

అక్కడక్కడ నెక్కొకలక్షాధికారియో కోటీశ్వరుడో తులాభారముతూగుచున్నంతమాత్రమున దేశము దరిద్రదశ ననుభవించుచుండుట లేదనుటకువీలులేదు. మానవ దేహమందేదో యొక యంగము ప్రబలియఖండపుష్టిననుభవించుచుండ తక్కినయంగములీమకొనిపోయియున్న నా దేహమారోగ్యవంతమనుట కెట్లువీలులేదో యావిధముననే సర్వజనులును సుఖజీవనము చేయుటకువీలులేనిదేశమును నైశ్వర్యవంతమనఁజెల్లదు.

ఎంతకాలమన్యోన్యాభిమానముతో హిందువులు చరించుచుండిరో యంతవరకు నైశ్వర్యమున వర్ధిల్లుచుండిరి. ఐకమత్యాభావమెప్పుడు పొడసూపినదో యట్టిదుర్గుణమును వెన్నుదన్ని యంతచ్ఛిద్రములును గృహకలంబములును ప్రబలిసుందోపసుందులవలె నన్యోన్య నిర్మూలనమును చేసికొన పెనగులాడుచుండుటవలని నష్టమటుండ మన దుర్దశంగని పెట్టి పరరాజులుఘాతుకమృగములవలెమన దేశముపై కురికి చిత్రవధచేసి పాడిపంటలపదటగలిపి ధనములంకించుకొనిపోవుచుండునట్టి దుర్దశాపాదకములగు దండయాత్రలవలననమ్మదిచెడి విద్యలకును వృత్తులకును గట్టి దెబ్బతగిలిక్రమక్రమముగా క్షీణించుచు వచ్చినవి. కాని

యిట్టిదోపిడి దండులంతరించి హిందూదేశమునే స్వదేశ ముగా జేసికొని జన్మభూమితో సంబంధమును విసర్జించు కొని, మహమ్మదీయులు హస్తినాపురమని ప్రసిద్ధిగాంచిన ఢిల్లీ పట్టణమున మూర్ధాభిషిక్తులై హిందూరాజ్యపరిపాల నమారంభించినది మొదలు విద్యలును, వృత్తులును, వెను కటిపిమ్మట తలలెత్తుటయు, మహమ్మదీయులు తమవెంటఁ దెచ్చిన క్రొత్తవిద్యలును, క్రొత్తవృత్తులును, పూర్వపు వానితో గలియుటయు, సంభవించి ఫిరోజిషా, అక్బరు, షాదుషాహున్నగు చక్రవర్తులకాలమున దేశమునకున్నమ్మది యు కృషివ్యాపారములకు వ్యాప్తియు కలుగుచువచ్చినది గానీ యెంతో కష్టపడి దేశదేశముల వెంటదిరిగి యనేకవిధ ములగు పుష్పఫలజాతులవిత్తనములను సంపాదించి మిగు లధనము వెచ్చించి పాటుపడి పెంచినతోట ఫలోన్ముఖమై కొద్దికొద్దిగ రుచిచూపి నాలుకతడుపుచుండు సమయమున నొక్క జంఝామారుత మతిప్రళయముగవీచి చెట్లను వేళ్ళతో పెకలించి, తోటను నాశనమొనరింపతిరిగి యెంత కాలమువరకో యొక్క యరటికాయ యైనను కన్నులకు కరవుగ జేసినట్లు నవాబులో, అమీరులో, యే సామంతరాజులో, కలదానితో సంతసింపక కయ్యములకు కాలుద్రవ్వి తాముసెడి పగవారిని జెఱుపుటయెగాక తమ కేయపకారమును జేయని జనసామాన్యమునుగూడ వీరా వేశమునపీడించి సంక్షోభ మున్పటప్పట నొనరించుచుండ

వంగవరకును పెంపుజెందుచువచ్చిన విద్యాకృషులకు వి ఘాతము కలిగి పునః ప్రయత్నము చేయవలసి వచ్చుచుం డెను. అందుచే మూర్ఖదశనుండి కొద్దికాలముక్రిందటనే బయలుదేరిన యైరోపాఖండవాసులు దినదిన ప్రవర్ధమా నులగుచు సర్వవిధముల వృద్ధిమార్గమున ప్రయాణముచే సి మనలను గలుసుకొని లిప్తమాత్రమున మనలను వెను కకు దిగద్రొక్కి యంతరిక్ష మార్గము నందియున్నారు. ధర్మశాస్త్రములకును ప్రకృతి శాస్త్రములకును తారత మ్యముగలదు అనేకశతాబ్దములకు పూర్వము రచింపబ డిన మన మతగ్రంథములును నీతిధర్మశాస్త్రములును, వే దవేదాంగములును, యుపనిషద్భగవద్గీతలును, నిప్పటికి గూడనన్యదేశముల వారిచే కొనియాడబడుచు నేయన్యమ తావలంబనమును నవసరములేక మనము పుణ్యమార్గమున జరించి తరించుటకుచాలియున్నవి. ఈమధ్యకొంతకాలము క్రిందట మనలో పితృదేవతాభక్తికి తుప్పుపట్టినను, ఇప్పు డిప్పుడు దేశాభిమానమును, పెద్దలయందుభక్తియును, నీ తియందు దృష్టియును బలపడ నారంభించుచున్నయవి. మన మతగ్రంధములవైపు పిన్నపెద్ద లందఱకును దృష్టి తిరిగి యభిమాన మెక్కువ యగుచున్నది. ఈమధ్యకా లములో నేతిబీరకాయవంటి బ్రాహ్మణ బృందమునకు శా స్త్రసంస్కారము లేక హృదయపాదపములందు బదనికలు బొడసూపుటవలన శిష్టాచారములనుపేర ననేకదురాచార

ములు శోగశాతీగి మైహికాముష్మిక మార్గములకు నడ్డంకి గలిగి పరులకన్నులకుఁబరిహాసాస్పదులముగఁగన్పట్టుచుం డుటచేతఁ గూర్చుండి లేవలేనివారుసై తము మనల నాక్షే పించుట కవకాశముకలిగినది. ఉద్గ్రంథముల నందఱునుజ దివి వానిమర్మములనుబాగుగ గ్రహించుట కవకాశము కలుగుటవలన విద్యావిహీనుల వెఱ్ఱిమూటలయందు నమ్మి కతగ్గి మతమునుద్ధరించు ప్రయత్నములు నలుదిక్కులను చే యబడుచున్నవి. సముద్రయానము దూష్యమనునమ్మిక తప్పిపోయి మనయాచార వ్యవహారములయందును దేశమం దును నభిమానముగల పెద్దలన్యదేశములకు నౌకాయాత్ర లుసలిపి రాగా కిమ్మనకుండ వారితో భోజనభాజనములు న లుపుచున్నాము.

కృష్యాది శాస్త్రములనుగూర్చి యిటుల చెప్పుటకుపీ లులేదు. కాలుసేతులే ఘనాయుధముగానుండు కాలము మొదలాయుధములును, పనిముట్లును, నయోమయము లగు కాలమువరకును క్రమక్రమముగ శిల్పాదికృషి శాస్త్రములును వస్త్రాదిప్రకృతిశాస్త్రములును, మారు చునేవచ్చినవి. బుద్ధికంతమెటులనుండదో యాబుద్ధివల న జనించుప్రకృతిశాస్త్రములకు నటులనేయంతముండదు ఇంతవరకునడచితిని యికనడుననవసరములేదని విపివియా రకుండుట కవకాశము లేదు. ఆశకంతము లేకుండుటచే ను కనాడు సౌఖ్యమును కల్పించుసాధనములనుకని పెట్టి క్రొ ద్ది

కాలమనుభవించిన వెనుక మనస్సు మరియొకసౌఖ్యమును కోరుచుండును. ఆదియందు లేనివృత్తులును సుఖములుని ప్పటికెన్నో బయలువెడలినవి. ఇకముందెన్నిగానైయున్న వో యెవరెఱుంగుదురు. గొంతుకతో పాడెడుసంగీతము కొంతవరకుండి యభివృద్ధి నొందుచుండ బలువిధములగు తంత్రీవాద్యములును, సనాయిలును కల్పింపఁ బడినవి. కొద్ది సంవత్సరములక్రిందట నట్టి యంత్రమొకటి చూచి తినని హరిశ్చంద్రునియంతటి సత్యవాదిచెప్పినను పట్టి దబ్బ రయనిలోకమునునట్టిఫోనాగ్రాఫులు, గ్రాఫోఫోనులు, గ్రా మోఫోనులు పాడసూపి ముద్దైనపాట యొక్కసారివినిన నాపాటకుడవ్వలకేగినను గూడ నేయిసారులైనను విని కాంక్షతీర్చుకొనుటకవకాశముకలిగినదిగదా.

ఈ రీతిగనే యొక్కొక్క లేని దానియందవస రము కనపడియో, యున్న దానినంతకన్న నెక్కువదశకు దెచ్చుబుద్ధి జనించియో, బుద్ధిశాలురన్య దేశముల ననేక విధములైన యంత్రములను కనిపెట్టి వృత్తుల నుద్ధరించి బాగుపడుచున్నారు. ఏకృషిలేక కృశించుచున్న మనకట్టియం త్రములును వానిఁగూర్చిన శాస్త్రములెక్కడనుండివ చ్చును! ఆముష్మికసాధనములగు నీతులు లోకమునందె ప్పుడును మారజాలవు. ఒకకాలమున "సత్యంవద, ధర్మం చర" యనియుండ నింకొకకాలమున నానీతులడుగంటి

ముక్తిమార్గమునకు సధర్మమునచరింపుమని శాస్త్రిముపుట్టుట కెన్నటికిని యవకాశము లేదు.

నిన్నటిదినము తినిన భక్ష్యములకన్న నేడు మాధురతరములగు వస్తువులనుచేయు మహోవస శాస్త్రిము బయలువెడలుట కవకాశమున్నది. నిద్రించు సింగము నోటతమంత మృగములుచొరవు. కృషిలేక ఫలము లభింపనేరదు. అన్యదేశయాత్రలు సలిపిగాని అన్యదేశీయులిక్కడనడచుచున్న దారులుచూచిగాని నీతియుతమగు నైహికవృద్ధికందరు యత్నింపవలయును.

---

# ఆర్యప్రభావము



## 1 వ ప్రకరణము.



హిందూదేశమనుపేర నాసేతుహిమాచలము వ్యాపించియున్న మనదేశము తక్కిన యనేకదేశములవలె వేషభాషలయందును, శీతోష్ణములయందును, నాచారవ్యవహారములయందు, నొక్కవిధముగానుండక పలువిధముల నొప్పుచుండుటచే దీనిని ఐరోపా, ఆస్ట్రేలియా, ఆఫ్రి ఖండములవలెనే యొక ఖండమనజెల్లును.

హిమవత్పర్వత ప్రాంతవాసికత్యంతావసరములైన ముసుగుబొంతలును, చలికుంపటులును, విప్పనెగళ్ళును, దక్షిణభాగమందు నివసించు వారికవసరములేదు. ఒకభాగమున శీత మెక్కువ బాధకరముగా నుండి మఱియొక భాగమున నుష్ణముదుర్భరముగానుండును. కొన్ని ప్రదేశములయందధికవర్ష బాధచే దట్టముగ వేయఁబడిన యిండ్లవసరమైయుండ మఱియొకచో వర్షమున్న కన్నులకు కఱవుగానుండి యట్టిగృహముల యవసరము తక్కువగానుండు

ను. ఒకభాగమందుప్రజలు గోధుమలుతిని జీవించుచుం
డ మఱియొకచోట బియ్యమే యాహారముగ నుండును.
ఉప్పొకచోట పండుచుండ ధాన్యమింకొకచోట సేవ్యమగు
చుండును కొన్ని శాఖలబ్రాహ్మణులు మాంసభుక్కులును
మత్స్యభుక్కులును గానుండ మఱికొన్ని శాఖలబ్రాహ్మణులకు
విదూష్యములై నిషేధింపఁబడుచున్నవి పరమపవిత్రమ
గు కాశీపట్టణమున జలమునకు శూద్రసంపర్కమువలననే
దోషమునులేకుండియుండ మఱికొన్నిచోట్ల నట్టిసంపర్క
ముగల జలమపేయమగుచున్నది.

ఎటుజూచినను సుఖజీవనమున కవసరము లగు సకలవ
స్తువులును, పలువిధములగు సిద్ధాంతములును మెండుగా
గానఁబడుచున్నవి. మనస్వతంత్రరాజులు, మహారాజులు,
నవాబులు, రాజపుత్త్రులు, జమీందారులు, మఱియెంద
ఱెందఱో ప్రభువులు దేశమంతటనున్నారు.

ఇట్టియైశ్వర్యమును, నిట్టిప్రభుసంఘములును కోటా
నకోటులగు ప్రజలను వెల్లికొల్లగ నున్నందులకు దేశము
నకందువలన, నైశ్వర్యాభివృద్ధులుగలుగుచుండినవీనినిదలఁ
చుకొని విఱ్ఱవీగిన బాగుండును. రాజాధిరాజుల కిరీటముల
యందుండుమణులును, భూగర్భమందడఁగియుండు లోహ
ములును, దేశక్షేమమునకిందవుగదా? మనకుఁ బ్రపంచ
జ్ఞానముగలిగి యన్యదేశీయులైశ్వర్యముతోఁ దులఁదూఁగు
చుండుటకు హేతువులను దేశయాత్రలవలనఁగాని చరిత్ర

లఁ జరుపుటవలనఁగాని తెలిసికొని మనముగూడ బాగుపడుటకు ప్రయత్నముఁజేయుట యత్యావశ్యకమైయున్నది. మనము మహోన్నతి దశనుండి యన్యరాజ్యపరిపాలనల ఫలముగానతి నీచదశకువచ్చి భగవదనుగ్రహముచే నాంగ్లేయప్రభుత్వముక్రిందికిప్పుడు వచ్చియున్నాము. మనకు చేయవలసిన విధులు నుపకారములు నింక ననేకములుండియున్న నిదివరకు కొంతలాభము నీప్రభుత్వమువారు కలుగజేసియున్నారు. మనకు జ్ఞానాభివృద్ధికొఱకు పాఠశాలలను, యాత్రికుల సదుపాయమునకై రైళ్ళు రోడ్డులు మొదలగునవియును, సుఖజీవనమునకును, వ్యవసాయాభివృద్ధికిననుకూలములగు ఆనకట్టలు కాల్వలు మొదలగునవియును నింకననేకవిధములగు సదుపాయములను ప్రభుత్వమువారు కలుగచేసి యున్నారు కాని వానివలన పొందవలసిన లాభములను మనమంతగా పొందుటలేదు. ఎంతెంతపెద్దపరీక్షలయందు కృతార్థులైనను మనవారిలో ననేకులుద్యోగజీవనమునకే పాల్పడుచున్నారుగాని ప్రకృతివలనను ప్రభుత్వము వారివలనను మనకు ప్రసాదింపఁబడిన యైశ్వర్యముల ననుభవించు దృష్టిగలవారుకాకున్నారు. అందునకువెన్నెల కొఱగానియటుల మనవారికిట్టి సదుపాయములవలన లాభమించుకయును లేకయున్నది. విద్యనున్యాయమార్గమందు వినియోగించునపుడే దానిలాభము మనకుండునుగాని యట్టిశక్తిలేనప్పుడా

విద్యానిరర్థకము. సర్వదేశములస్థితియు నెల్లభూముల సారమును. మనదేశమందెక్కడనో కానబడుచునేయున్న విషవిరెయో యొకటి రెండు ముసుగుబట్టలును మోటువస్తువులును తయారుచేసి యవియక్కడయమ్ముడుపోక వానినమ్ముకొనుటకు దూరదేశపుబజారులుపట్టుకొని తిరుగవలసిన యవస్థమనకులేదు. మనకుగలలోహాదుల సమృద్ధియును పనివాండ్ర చౌకయును, మనముక్రమముగ నుపయోగించుకొనగలిగితిమేని మనగొంతు నెక్కుపన్నులను భరించుచున మనయవసరములకును నానందములకును భోగములకునువలయు సకలవస్తువులను మననాల్గుగోడల నడుమనే తయారుచేసికొని మనపైపోటీకి డీకికొను నన్యదేశవస్తువుల నట్టుండుమని నిర్భయముగా చెప్పగలము. కాని మనము శుష్కవాక్యములతోడను, శూన్యహస్తములతోడను కాలము వ్యర్థపుచ్చుచున్నంతవఱకు నన్యదేశీయులు మనదేశమందలి వస్తుసముదాయమునెల్ల నెక్కువధరలకుగొని వారివారిస్వదేశములయందు వానితో బనులను జేసి యట్లుచేయబడిన వస్తువులమనకే యధికవెలకమ్మి మవ్రేలితోడనే మనకన్ను పొడుచుచుండకమానరు. మనలో గొందఱు దేశాభిమానులు యంత్రశాలాదుల నేర్పఱచియు న్యదేశములనుండి దిగుమతియైనసరకులతో సమానముగు వెలకో కొంచెముచౌకగానో యమ్ముచున్న మనయతినాగరికుల మనువ్యర్థదంభముగల ధనికులనేకులు స్వదేశవస్తువులను,

స్వదేశవస్తువులన్నంతమాత్రముచేతనే వానినినిరసించియ
న్యదేశములవానినే కొనుకొని ధన్యులమనుకొనిస్వదేశవ
స్తువుల నుపయోగించువారిని నిందించుచుండుటచే దూర
దృష్టిలేని మనవారలనేకులీమహానుభావులదారి నేనడచుచు
న్నారు. సభలయందు దేశభాషలతో మాటలాడువారిని నిర
సించియాంగ్లేయభాషయందు ప్రసంగములు సలుపుటయే
ఘనమనువారికిని వీరికిని భేదమేమియును లేదు.

నిజమైన దేశాభిమానము కలిగినవారెవ్వరు నిట్టిపనుల
కామోదింపరు. అట్లు నిస్వదేశమందు చేయఁబడు ప్రతితుక్కు
వస్తువులను తెచ్చి యింటపెట్టుకొనవలెనని మాయభిప్రా
యము కాదు. మడ్డితో నిండియుండు మట్టిప్రమిదలో వెలు
గు దీపములనుంచుకొను కొయ్యసెమ్మెలనే కొని చక్కగవె
లుఁగు గాజుదీపములను విసర్జింపవలయునని చెప్పువారెవ్వ
రునుండరు. అట్టివాఁడొకఁడట్టి పనికిపూనుకొనినను వాని
మాటలువినునంతటి వెఱ్ఱివాడుండడు. ఇక్కడ నేమునొక్కి
చెప్పునదియంతయు వన్నెచిన్నెలను సింగారములను జూచి
భ్రమపడక నాణెమైనసరకులు స్వదేశమందుదొరకుచుండ
గా నన్యదేశపువానిం జూచి భ్రమపడవలదనునదియే. విద్యా
ధికులును ధనికులును తమవిద్యాధనముల రెంటిని జతపఱ
చి యంత్రశాలలను చేతిపనులనుస్థాపించి వృద్ధినొందించి
మనదేశమునుండి పైకివెడలిపోవుచున్న లోహము, కలప
చర్మములు, ధాన్యము, నారలు, మొదలగువానినివర్తకు

లు పైదేశములకు పంపవలసిన యవసరములేకుండ వాని తోడనిక్కడనే పనులుచేయుచుండవలయును. అట్టి యంత్రశాలలలో సరకులనుతయారుచేయువారు దేశాభిమానమునకై యెంతపాటుపడుదురో యంతయభిమానముతోడ కొనువారుగూడ సిద్ధముగనుండవలయును. అటులమ్ము వారునుంగొనువారుంగూడ కలసిపాటుపడినగాని దేశమభివృద్ధిచెందనేరదు. కుక్షింభరులు బ్రదికియుండియును, వారి జీవనములు నిరర్థకములనిచెప్పవలెనా ! తనకుటుంబపోషణముచేసికొనుటమాని జోగులును విరాగులును గావలయునని మాయభిప్రాయముగాదు. స్వకుటుంబపోషణము చేయుచు బ్రతిమానవుడను దినము తనవలననైనంతవఱకు దేశాభివృద్ధికి పాటుపడవలయును. జాతి వైషమ్యములువిడిచి యేకులమందుపుట్టినను నెట్టికుటుంబములో చేరినవాడైనను ఎవ్వనికేపనియం దభిరుచిరో, యెవ్వఁడేపనికి తగినవాఁడో వాఁడాపనియందే కృషిచేయుచు శక్తుల నడఁగద్రొక్కి యన్యదేశీయులయందలి మంచి నంతయును గ్రహించి వారి దోషముల దరిజేరనీయక దివారాత్రము లేకదీక్షతో కృషిచేసి యఖండాభివృద్ధి నొంది తమ యైశ్వర్యముచేతను, తమ యంత్రశాలల చేతను విద్యాభివృద్ధిచేతను, బుద్ధికుశలతచేతను, యుద్ధనైపుణ్యముచేతను, లోకముయొక్కదృష్టి తమవైపునకు త్రిప్పికొనిన జపానుదేశ చరిత్రను చక్కగా చదివియైనను

మనముకన్నుల దెఱువకుండిన మనల నిప్పటిదుర్దశనుండి యుద్ధరింపనెవ్వరికినితరముకాదు. జపానుదేశీయులుత్వరలో బాగుపడినందులకుజూచి యాశ్చర్యపడువారలేగాని వా రట్టిదశ కేవిధముగావచ్చిరోయని పరిశీలించి యావిధము గా నడవడిమార్చుకొనువారు మనలోగనపడరు. తమరును నేషియాఖండవాసులమేయని వారితోపొత్తుగల్గువు నగ స్త్యభ్రాంతులు వారిదశకెన్నడును రాజాలరు. వారినిజూ చిపడు నాశ్చర్యమునకు దోడభిమానము నాశ యును గూడ జతపడవలయును కేవలాశ్చర్యము పెద్దగడియార మునుజూచి యాశ్చర్యపడిన పల్లెటూరివానికివలెనేముప్పు నాపాదించును. ఆకధసంక్షేపముగాజెప్పి యీప్రకరణము ను ముగించుచున్నాము.

ఒకపెద్దపట్టణమున కూడలియందు పురవాసులందఱి యు పయోగార్థము గడియారపు గోపురమొకటి స్థాపింపబడి యుండెను. గంటలుకొట్టుగిన్నెయును సుత్తియును క్రింది యంతస్తునందుండి యాయంతస్తునకు ద్వారమును తలుపు లునుండియుండెను. ఒకపల్లెటూరివాడా గడియారము నా శ్చర్యముతోజూచిజూచితనయాశ్చర్యమంతటితోదీరకతలు పుదెరచి యుండుటచే కాలచోదితుడై యందుబ్రవేశించి యాశ్చర్యముతో గిన్నెవైపుతిరిగి చూచుచు గంటలుకొ ట్టుసమయము వచ్చువఱకును నావిధముగానే చూచుచుం డుటచేనాగిన్నెకు కొంచెముదూరముననున్న పెద్దసుత్తియం

త్రిసాధనమువలన పైకిలేచిగిన్నెవైపు బలముగావిసరుకొనుటచే గిన్నెకునుసుత్తికిని మధ్యనున్న పల్లెటూరివానితలయాసుత్తితాకుడుచేపగిలిమెదడూడిపడి వెంటనేప్రాణములువిడిచెనట కాననితరులజూచి యాశ్చర్యపడుచు చేష్టలుదక్కి నోరుతెరచుకొని యూరకుంటిమా మనకేలాభమునులేకపోగాపిడుగువలెనేదినో యాపదవచ్చిమీదబడి యడుగంటిపోదుము.

యంత్రశాలాభివృద్ధి చేయుటయందుగల దేశాభిమానమును గూర్చి వ్రాయబూనుకొనిననెంతగ్రంథమైనను వ్రాయవచ్చునుగాని మాయుద్యమము నిద్రించుచున్న మన రినివా లేపుటయేగావున నందు కవసరమగు సంగతులనే యిందు వ్రాయుదుము.



# అయః ప్రభావము.



## 2 వ ప్రకరణము.




ల్లాబుట్టయును, తక్కెడయును పెట్టుకొని చిల్లర సరకుల నమ్ముకొనెడు చిన్న దుకాణదారునకును, కుర్చీలును, మేజాలును, పంకాలును వేసికొని యమూల్యవస్తువుల నమ్ముకొనెడు పెద్దవ్యాపారికిని సంపాదించులాభమందును, అనుభవించుసుఖములయందు నెంత వ్యత్యాసమున్నను దేశాభివృద్ధికి వీరిద్దరు నొక్కరీతిగనె యక్కఱకు రాకున్నారు. హిందూదేశపువర్తక మఖండాభివృద్ధిని చెందవలయునన్న నిట్టి దుకాణములవలన ప్రయోజనములేదు.

* జాయింటుస్టాకుకంపెనీలు దేశమంతటను వెలసివర్ధిలవలయును. ఎంతధనవంతులయిన నొకరిద్దరుచేరి వ్యవహరించఁదలఁచుకొనినయెడల నతి విరివిగా వ్యాపారములుచేయుటకు వారిధనముచాలదు. ఇంటింటికినొకపుష్పముసేకరించిన దేవునికి మాలయగునన్నట్లు మనదేశపు ప్రజలందఱును కొద్దికొద్దిమొత్తముల నిట్టికంపెనీలలో వేసికొనునట్టి

* అనగా తలకొకస్వల్పమొత్తముచొప్పున నెక్కువధనమును పోగుచేసి యందులో కొందఱు కార్యనిర్వాహకులుగానేర్పడి వ్యవహరించుసంఘము జాయింటుస్టాకుకంపెనీ యనంబడును.

యలవాటు నేర్చుకోవలయును. అట్లుచేసినయెడల క్రొద్దికాలములోనె దేశమభివృద్ధి పొందుననుటకు సందియము లేదు. మనదేశమున మూరుమూల గ్రామముల యందు గూడ పనిచేసిన లోకోపయోగమునకు తేదగిన వస్తువులు దొరక గలవు. ఎవ్వడో యొక్క డీసంగతిని కనిపెట్టినను తనంతటతాను కృషిచేసి దానివలన లాభమును పొందజాలడు. ఎక్కువ చొరవ గలవారు కొంతఅక్కడక్కడ నిట్టి వ్యవహారములలో ప్రవేశించి కొంత ధనము వ్యయ పెట్టి యూపైని ధనలోపమువలన పని సాగింప జాలక నష్టమునుబొంది చేతులు వెల్లకిలవైచుకొని దుఃఖపడ వలసివచ్చుటచే నట్టివారికి గల పదుద్దేశమును సాహసమును నితరులకు మార్గదర్శకముగానుండుటకు బదులుగా వారింజూచి యితరులు నిరుత్సాహులగుటకు కారణభూతములగుచున్నవి. ఇట్టికార్యములను నిర్విఘ్నముగ కొనసాగింపవలయునన్న నెట్టిచిగ్రామమునైనను గ్రామవావాసులంతయును కావలసినమొత్తమును చందాపూర్వకముగా పోగుచేసి కార్యనిర్వాహకసభనొకదాని నేర్పఱచుకొని పనిసాగించి దానియభివృద్ధిని జాగరూకతతో జూచుచులాభము పొందుటయందు దృష్టినిలుపుగుణము శీఘ్రముగానేర్చుకొనవలయును. మనదేశముచేసికొన్న పాపముచే పల్లెలటుండ పట్టణములయందైనను విద్యావంతులై యితర దేశములయొక్క యభివృద్ధిని కనుగొనుచున్నవారుకూడ

నిట్టిజాయింటుస్టాకుకంపెనీలలో సొమ్ము వేయుటకు జంకుచున్నారు. ఎక్కడనో యొకటి రెండు రాజధానులయందు మాత్రమిట్టి వ్యాపారపురుచినిమఱిగి కొందరు హిందూదేశపుధనముతోడనే యిట్టికంపెనీలను స్థాపించి పనిచేయుచున్నారు. ఎంతకాలము సాహసము లేక యిట్టి కార్యములకు మనవారు వెనుదీయుచుందురో యంతవఱకును మన కృషి వాణిజ్యములు స్వంతవ్యాపారము చేసికొను వారి చేతులయందుండును గొప్పగొప్పయోచనలును కార్యములును వెనుకబడి యుండును. మనవారికి ధనాభివృద్ధిచేయుగాను ప్రతిభానమున్నను, ధనికుండై యందల మెక్కవలెనన్న యాశకలిగియే యుందురు, అట్లుండియును యన్యదేశములైశ్వర్యమున దులదూగుచుండుటకు సాధనము లైన నిట్టి వ్యాపారములనెఱింగినవారుకూడ నెందులకట్టిదానిని త్రొక్కలేకున్నారని యడుగవచ్చును. కారణములేక కార్యముపుట్టదు. మనవారికిగల వెనుకటకు హేతువులున్నవి. అందు మొదటిది ధనమన్న శబ్దమునకు మనవారికి దెలిసిన యర్థము సరియైనదికాకపోవుట. ధనమన రూపాయిలును కాసులుననియును, ఆస్తియన నగలును భూములు నిండ్లును మొదలగునవియనియును. తమచేతపట్టి తమ కంటజూడనిది ధనమనుకొను జ్ఞానము మనవారికి లేదు. ఇట్టి యూహాలకు హేతువలేకపోలేదు. కోటానకోటులచే నింపబడిన ధనాగారములును, నవరత్నఖచితములైన దేవాల

యములును, విగ్రహములును పరరాజులపాలగుచుండుట యటుండ దేశమందుగూడ మరాటీపిండారీదండులు ఫాసీగరులుయానాదులు మొదలుగుదోపిడిమూకలు వారితోపాటు జమీందారులు, మన్నెదొరలు మొదలగువారును మిడతల దండువలె దేశముపైబడి చిత్రవధచేసి పీడించి కలధనము దోచుకొనిపోవుచుండుటచే నూతనోగోతనోపాత్తి పెట్టుగుణము మనవారి కనాదినుండియే కలిగియున్నదన నాశ్చర్యమేమి? ఈహేతువుచేనెవనికిగలధనమును వాడువీలగునంత భద్రపఱచుకొన పాటులబడుచుండుటయే ప్రధానకార్యమై యుండుటచేత నేదొంగయునుమోసికొనిపోజాలనిభూముల మీదను గృహములమీదను సొమ్ముకర్చుపెట్టుచుండి కొంతధనముమాత్రము స్త్రీలకలంకారములక్రింద నాభరణములక్రిందను వినియోగపఱచుచుండుదురు. మనవారిలో నెక్కువజాగ్రతగలవారు నగలయందు తక్కువసొమ్మువెచ్చించుచుండురు. ఉన్ననగలన్నియు నొక్కసారిగధరించిన దొంగలకు కన్నెట్టగనుండునని వానిలోకొన్నిటినే యుపయోగించుచు తక్కినవాని నతిజాగరూకతతో దాచుచుందురు. ఇప్పుడట్టి దోపిడులకవకాశము తగ్గిపోయినది. గాని యొడలనంటినవాసన మనలనింకను విడువకున్నది. ఇదియటుండ సంఘీభవించి విరివియగు వ్యాపారములచేసిస్వగ్రామము విడచి యన్యగ్రామములతో వర్తకవ్యవహారసంబంధములు కల్పించుకొనుట కిప్పటివలె పూర్వము రోడ్లు కా

ల్వలు యినుపదాకులు మొదలగు సాధనములెవ్వియును లేకుండుటచే కూలికూర్పములవలె నెక్కడపుట్టినవా డక్కడనే యీకులాచారము కలిగినదానితో కాలముగడుపవలసిన దశయందు మనవారుండెనువారు. కాలముమారినదిగాని యాంగ్లేయవిద్యాభ్యాసకులకు గూడగతులుమారకున్నయవి. భూములయందిప్పటికిని విశేషధనము వ్యయము చేయుచున్నారము కాని పన్నులమీద పన్నులు తరముల మీద తరములు భూమిపై నెక్కుచుండుటచే పన్నులును వానికితోడఫకార పిశాచములకు చెల్లింపవలసిన ముడుపులునుపారములును పోనునేటేటచేయు వ్యవసాయమువలన దానుపసులునుగూడ భక్షించుకొరకు కాపువానికి గడ్డిమాత్రము మిగులునన్న లోకోక్తి నిజముగుదశ వచ్చుచున్న దని మనవారిలో ననేకులకు తోచుచుండుటచే భూమిపై తీపి తగ్గుచున్నది. ఉన్న ధనమును స్వలాభమునకును దేశాభివృద్ధికిని గూడవినియోగపఱచుటకు నవకాశము గలుగుటయేగాక యిట్లువినియోగించినవారు పొందుచున్న లాభములనుగూడమనము చూచుచునే యున్నారము. కావున దేశాభిమానియగువాడుతనతోడివారికెల్లరకు నిట్టికంపెనీలయందుచేరి వానినభివృద్ధినొందించి తామును బాగుపడు ప్రయత్నమును పూనికతో చేయవలసియున్నది.

దీనికింకొక కారణము గూడగలదు. మనదేశమునందు వడ్డిబేరములాడు సావుకారు లితర దేశములయందువలెనే యుండియున్నను సొమ్మునిలవచేయు ప్రతివారును వడ్డిబేరముల కలవాటుపడియున్నారు. ధనమునిలువచేసిన జమీందారులు తమయైశ్వర్యమును తమయొక్కయు తమరయితులయొక్కయు నభివృద్ధికి వినియోగపఱచుటలేదు. పెద్దయంత్రశాలలు మున్నగు కృషుల యందుపయోగపఱచు బుద్ధి వారికిమొదలేలేదు. అప్పులలో మునిఁగి తేలుచున్న యితరజమీందారుల జమీలను తనఖాలుపట్టి వడ్డీలకట్టి వారలకు లక్షలకొలఁది బదుళ్ళిచ్చుచున్నారు. పెద్దపెద్ద పరీక్షలయందుఁగృతార్థులయి, లాయర్లుగానుండు వారిలో ననేకులుగూడ నీవిధముగా తమధనమును టోకునను చిల్లరగను లోకులకు ఋణములిచ్చి తమధనమును వృద్ధిచేసికొనుచున్నారు. ఒక పెద్దజమీందారీవ్యాజ్యములో నఖండకృషిచేసి న్యాయసభలయందు తమశక్తియుక్తులనుగనపఱచి గౌరవమునుసంపాదించు నొకవకీలో, ప్లీడరో చంద్రశేఖరమో, కాసులపేరో, యొకముసలమ్మ తాకట్టునకుతెచ్చినదన్నంతమాత్రమున తాజేయుపనిని విడచియైనగను తూచుకొనిబంగారము నొకటిరెండునెలకో, రెండునెలలకో, తీర్చుపద్ధతిని నూటికి రూపాయివడ్డిచొప్పున చిల్లరమొత్తముల హైకోర్టువారియుత్తరువులేకనే బదులిచ్చుచుండుట మనవారికందఱికిని తెలిసినయంశమే. ఇట్టిపనులు చేయుటలో

తప్పిదమును దర్జాయు నెట్లున్నను లాభము పట్టుకు గలదు. ఈయలవాటుమనలో ధనికులకు లేకయుండిన నాంగ్లేయులు మొదలగువారివలె తమనిలువధనము కంపెనీలలో భాగములు కొనుటకయి వినియోగింతురు. అటులగాకున్న స్వల్పవడ్డీలకేదో యొక బాంకులో నిలువజేసికొందురు. అసలు చెడఁగొట్టు కొనునట్టి యభ్యాసము వారికి లేకుండుటచే నధికవడ్డీల కాశించరు. ఆ బ్యాంకులు తమ స్వాధీనమందు కోట్లాన కోట్లు ధన ముండుటచేత, దానిని పాతిపెట్టియుంచిన తమచేతి సొమ్ము వడ్డీల క్రింద నియ్యవలసి వచ్చునుగాన నట్టిధనమును యంత్రశాలలు, వ్యవసాయము మున్నగు కృషులయందును వర్తకము నందును వినియోగించుచుందురు వర్తకమందో, కృషియందో, వినియోగపరచినధనముకన్న నెలనెలకు వడ్డీచేతపడునట్టి బేరమెక్కువలాభముగా దూరదృష్టి లేకుండుటచే గనఁబడునుగాని బాగుగ యోజించినయెడల నట్టిలాభ మొకలాభమునఁ జెల్లదు. వడ్డిబేరములాడుకొను వారిలో నెక్కువమందియొక్క ధనమంతయును వడ్డిమీఁద తిరుగుచుండుటకు వీలులేదు. ఇతరులకిచ్చినమొత్తముపై యెక్కువలాభము గలుగుచుండిన నింటమూలుగుచుండు ధనమునకు వృద్ధికలుగుటయును లేదు. కంపెనీలలో ధనము వేసినయెడల మొత్తముంతమీఁదను లాభమువచ్చుచుండుటచే నావిధముగా వృద్ధి చేయుటయే యెక్కువలాభకరమని చెప్పవచ్చును. కొన్నికొన్ని కంపెనీలు

పలువిధములగు కారణములవలన నష్టమనుభవించు మండుటచే నా విధముగా ధనమును వినియోగ పరచఁ గూడదనుట వెఱ్ఱి యాలోచనము. వడ్డి బేరము లాపుటలోఁ గల నష్టములు దానికిని యుండియే యున్నవి. అధికవడ్డీలకాశించి లోకులకు ఋణములిచ్చి యెందఱు చెడుచున్నారు కాదు. రిజష్టరీచేయఁబడిన దస్తావేజులపైని చ్చినఋణములకు ఋణప్రదాతలుపడుచుండుచిక్కులుసనమెులుగవివి కావు. జన్మమెత్తినది మొదలు మనుజులుచేయుచుండు ప్రతికార్యమునందు నప్పుటప్పుట చిక్కులు సంభవించుచునేయుండును. అట్లని మిన్నకుండిన నెడల దేహయాత్రసలుపుటయెట్లు? అప్పటప్పట భోజనవ్యత్యాసములచే రోగములు సంభవించుచున్నవని భోజనమును విసర్జించునంతటి పందయుండునా? ఇట్టిచిల్లరవ్యాపారములవలనగాని మనకు దేశాభివృద్ధి కలుగనేరదు. ఋణమిచ్చుధనమునకు కంపెనీలయందు వేయుధనమునకును నింకొక వ్యత్యాసముకలదు ఒకఁడుతనయొద్ద రు 200 లు నిలువయుండి యందొక రు 100 లు వడ్డీకిచ్చుచు తక్కిన నూరురూపాయిలు నొకకంపెనీయందు భాగమును కొనుటకు వినియోగపఱచెనని యోజింతము ఈమొత్తమునకు నామొత్తమునకుసుగూడ నేచిక్కులును లేక దీని లాభము దీనికిని దాని వడ్డిదానికిని వచ్చుచున్నను వడ్డికిచ్చిన రు 100 లునెంతకాలమున్నకెనను కనుబాము పెరోమము

వలె నెనుగుబాడుగులు లేక నూరునూరుగ నేయుండును కం
పెనీలోభాగమునకు వేయబడిననూరురూపాయిలును వా
ని పైవచ్చులాభమటుండ రు100 రు150 కావచ్చును కంపె
నీయొక్క లాభమునుబట్టి యింతకన్న వృద్ధికావచ్చును.
ఈమధ్య మనదేశమునందు కొన్నికంపెనీలలోని నూరురూ
పాయిల భాగము లత్యధికమైన వెల కమ్ముడుపోయినవి.
బర్మాదేశమందలి యొకకంపెనీ నూరురూపాయిల భాగము
రు 500 లకమ్ముడుబోయినది. కనుక యనేకులకు జీవనము
గల్పించి దేశాభివృద్ధిని పెంపుజెందించుట యటుండనీ లాభ
మొకటి మిక్కిలియెక్కువది.

అక్కడక్కడ మనదేశమందు స్థాపింపఁబడిన కొన్నివ్యాక్ట్
రీలవలన నష్టముగలుగుటచేత నవిదిలచుకొని మనవారు బె
దరుచున్నారని చెప్పియుంటిమి. నిక్కమాలోచించి చూచి
నయెడల వట్టివ్యాక్టోరీలు చెడుటకు కారణములు లేకపోలే
దు. బంగారుగనులు త్రవ్వుటమొదలగు పనులకై యేర్ప
డినకంపెనీలకు లాభమువచ్చినయెడల కుప్పతిప్పలుగా పొ
రలివచ్చును, లేకున్నయెడల వట్టికంపెనీ లడుగంటిపోవును.
ఇట్టి వ్యాపారములయందు ధనమువ్యయపుచ్చుట జూద
మాడుటవంటిది. అటుగాక దేశకాలపాత్రములను బాగుగా
యోజించి మనకవసరమైనవస్తువులనుతయారుచేయుయం
త్రిములను స్థాపించినయెడల నష్టములేదు సరియేకదా స్థా
పించినవారికిని ప్రజలకుగూడ పలువిధములైన లాభము

లుగలవు. బొగ్గుగనులుదొఱకినచోట నాబొగ్గునుత్రవ్వుట కుకంపెనీలేర్పఱుపవచ్చును. బొగ్గుగనికిని బంగారుగనికినివ్యత్యాసము విశేషముగాగలదు. బంగారుగని యెన్నటికినితఱుగనట్లుభ్రమింపఁజేసి లక్షలకొలదిసొమ్ముపోగుచేసి కంపెనీ యేర్పఱచి మిక్కిలి విలువగలయంత్రములనుకొనియింకను పనిసాగించుటకవసరమగునన్నిటికినిసొమ్మువెచ్చించి పనిప్రారంభించిన యొకటిరెండుమాసములవరకు బంగారుదొరుకుచువచ్చి హటాత్తుగానంతరించును ఆపైనిత్రవ్విననదొఱకునది మృత్తిక. భాగస్వాములు తినునదియునువట్టిదే. కాతుసిబొగ్గుగని పరీక్షించినతోడనే యెంతకాలము పనిచేయుటకువీలుండునో యెన్నిబారలవరకు బొగ్గుదొఱకునోకనుగొనుటకు సాధనములుగలవు. అందుచే నీబొగ్గునుతీయుటకేర్పడిన కంపెనీలకు బంగారుగనులకు వంటివిపత్తులేదు ఏదేశమునధాన్యమును నారయును పత్తియును నెక్కువగనుండునో వానినిగూర్చి పనిచేయు యంత్రశాలలాయాస్థలములయందు స్థాపించుటవలన కంపెనీలకు లాభముగలుగుటచే పదార్థములు తక్కువ వెలకమ్ముటకును వీలుకలుగును. మనదేశపుధాన్యము, నార, పత్తి, చర్మములు, ఎముకలు, * తోటియేకలు, మొదలగునవి వేలకొలది మైళ్ళదూర మన్య దేశముల కెగుమతి చేయబడి యచ్చటి యంత్రశాలలయందు వానితోతయారు చేయబడిన వస్తు

* తోటికిబుతోనుండి వచ్చునల్లనియీనెలు.

వులు మనదేశమున కమ్మకమునిమిత్తము రావాసినయవసరము, మనధనముచే నట్టి యంత్రశాల నిచ్చటనే నేర్పఅచక పోవుటచేతనేగదా!

పైన చెప్పబడిన లోపము లన్నియుగూడదేయజాలిన యంత్రశాలాభివృద్ధికి వేరుపురుగువంటిది వైకమత్యాభావము. నలుగురుకలసి యొంతపని చేయబూనుకొన్నను బయటనుండి యాక్షేపించు నిరర్థకులమాట యటుండనా పనిచేయు నలుగురైనను ధారాళమగు నంతఃకరణలతో నొకరినొకరునమ్మిపని చేయుటయరుదు. ఇట్లైకమత్యమును నమ్మికయు లేకపోవుటకు కారణములనేకములుగలవు; అట్టి హేతువులన్నిటిని యితరులకువివరించిచెప్పనట్టుల ఆరోగము శరీరమందాశ్రయించియున్న మనవారికంతగా చెప్పనవసరము లేదు. ఏనొకరుచేతికిసొమ్మిచ్చి వస్తువులకొనితెమ్మనినను వాడొకదమ్మిడీయైనను దానిలో మిగుల్చుకొనకమానడు. అట్లు మోసముచేయనివాడు నూటికొకడుండినను యజమానునికిమాత్రము వానియందు నమ్మికకుదురుటకు చాలకాలముపట్టును. ఎంత గుణవంతుడైన కంసాలికి బంగారమునిచ్చినను తానడిగినకూలి యిచ్చినప్పటికిని కొంత మోసముచేయక మానడు. ఎంతగొప్పవర్తకుని యొద్ద సరకులుకొనబోయినను అమ్మువాడు కొనువానిని, కొనువాడమ్మువానిని నమ్మివ్యవహరించరుగదా! ఇప్పుడిప్పు

డుమనలో నిట్టిమార్గము తగ్గుచున్నను రాజకీయోద్యోగు లొకరినొకరు నమ్మక వ్యవహరించుచుండుటవలన కలుగు చుండెడిముప్పు లందరికి విశదమే. జనసామాన్యమునందీ దోషముకలిగియున్నది. ఇట్లని మనము నిరుత్సాహులము కావలసినయవసరము లేదు. 30 కోట్ల ప్రజలుగల భరతఖండమున నేవంకయును వేలుపెట్టి చూపుటకు వీలులేనిసత్య శీలురును నీతిపరులు నెందఱో గలరు. అట్టివారు దేశాభివృద్ధిపై దృష్టినిద్రిప్పి పనిచేయనారంభించినయెడల దేశమునాశ్రయించియున్న యీయపనమ్మికత్వరలోనే తొలఁగిపోయి సామాన్యప్రజలుగూడ తమధనము నిట్టికంపెనీలయందు పెయుటకు ప్రారంభింతురనుటకు సందియములేదు ఇంకొక దృష్టాంతము; పై గ్రామముతోడను, పట్టణములతోడను, వ్యాపారసంబంధములు కల్పించుకొనుటకు రోడ్లు, మొదలగునవి లేనంతవరకు నాగ్రామములకు వర్తకవ్యాపారము సంగతియే తెలియదు. గవర్నమెంటువారుగాని, లోకలు బోర్డువారుగాని అట్టిగ్రామమునకితరగ్రామములతో సరకులు వగైరాలుపంపి తెప్పించుకొను వ్యాపారమేమియు లేదుగనుక నట్టిగ్రామమునకు రోడ్లువేయుట యవసరము లేదని యూవినచో నాగ్రామమునకు వ్యాపారము చేయు నవస్థ యెన్నడును కలుగదు. అట్టిగ్రామమునకు బండ్లు మున్నగువాని రాకపోకల కవసరములైన మార్గముల నేర్పఱచినవెంటనే యక్కడ వ్యాపారము ప్రారంభమై

క్రమక్రమముగా ప్రబలును. ఆరీతినే యొకరినొకరు నమ్మి పనిచేయు దేశాభిమానులు తమదారిని జనసామాన్యమునకు కనుపఱచకుండినంతవరకు వారిగుణముమారనేరదు. అట్టిరస్తాలను వారికిచూపించినవెనుక వారునామార్గముల ద్రొక్కుటప్రారంభించి క్రమక్రమముగా గుణము మార్చుకొని యొకరినొకరునమ్ముచు వ్యవహరించుటకవకాశము కలుగును. మనలో వస్తువుకొనదలచినప్పుడు బేరమనునది యొకటియుండుటచేత వర్తకునిమాట వెంటనే నమ్మికొనునట్టియభ్యాసము మనవారియందు లేదు. ఒక్కటే ఖండింపు ధరలకమ్మునని ప్రతిష్ఠగలిగిన షాపులయందే యపనమ్మికయును లేకకొనదలచుకొన్నవారు చెప్పినవెలకు కొనుచున్నారు. ఇప్పుడిప్పుడు మనవారిలోగూడ నట్టిపద్ధతివ్యాపించుచున్నది. గౌరవముతో వర్తకముచేయదలచిన ప్రతిషాపునందునమ్మెడివస్తువులకును వెలలతోపట్టీలు ప్రచురపఱుపబడుచున్నవి. అందుచేత బేరమాడునట్టి యవసరము తప్పిపోవుచు నొకరియందొకరికి యపనమ్మిక కవకాశములేకయట్టిగుణముమారిపోవుచున్నది. ఇప్పుడుమనదేశమున పలువిధములైన జాయింటుస్టాకు కంపెనీలు పొడసూపి ప్రబలుచున్నవి. ఇట్టివానిసంఖ్య యింకనునభివృద్ధియై పట్టణములయందును పల్లెలందునుగూడ నిట్టికంపెనీలు వెలసి వానివృద్ధితో దేశముయొక్క యైశ్వర్యముగూడ వృద్ధిచెందునట్టి కాలమునకెదురుచూచుచు పనిచేయుచుండుబుద్ధిని

వృద్ధిఁజెందించుపని విద్యాధికులగు దేశాభిమానుల యందు న్నది. అట్టిపనిచేయకుండిన నెంతధనికుఁడయినను తానె న్నిపరీక్షలయందుఁ గృతార్థుఁడయినను వానిజన్మము నిరర్థకము. ఇంతకుముందు బేరములవలన నొకరియందొకరికి అనుమానము లెక్కువయగుననియు నట్టియనుమానము లైకమత్యమునకు భంగకరమనియుఁ జెప్పియున్నందులకు గ్లిన్బార్లోదొరగారు, ఇండస్ట్రియలు ఇండియా యను గ్రంథమున వ్రాసినయంశమును సాకల్యముగానిక్కడ తెలియఁబరచియంతటితో నీప్రకరణము ముగించెదము.

ఒకఁడు గొడుగునొకటి కొనఁదలఁచె ననుకొనుఁడు. ఈ వ్యవహారములో నాతఁడెన్ని యబద్ధములాడునో యెన్ని యసత్యపుపనులు చేయునో చూతము. ఇతరవస్తువులతో పాటు గొడుగులుగూడనమ్మునట్టి దుకాణమునకేతఁడుపోవును. తనకుగొడుగు కొనుటయందే యభిప్రాయముండినట్లు దుకాణదారుఁడు తెలిసికొనిన వెలహెచ్చుగానడుగునని గడియారము కావలసినట్లునటించును. (మొదటియబద్ధము) తరువాత షాపులోనున్న గడియారములలోఁ దనకుఁ గావలసిన రకము లేనట్లునటించును. (రెండవయబద్ధము) షాపునంతతిరుగుచు గొడుగు లున్నచోటికిఁ బోయి వచ్చేనెలలో గొడుగు కొనునవసరము రావచ్చునన్నట్లునటించును. (ఇదిమూఁడు) గొడుగువెలయెంత యని యడుగును. దుకాణదారు మూఁడురూపాయిలు చెప్పును. కొనునాతఁడు

వెకవెకనవ్వి ఒకరూపాయి కడుగును. దుకాణదారు నిరసనతో పెదవివిఱచునుగాని రెండున్నరరూపాయిలకు దిగియంతకు తక్కువ కిమ్మనని యొట్టుం బెట్టుకొనును. అంతుమీఁదకొనువాఁడు రూపాయిన్నరవఱకు బేరము పెట్టును. ఇఁక నంతకంటెఁ జచ్చిన నెక్కువయియ్యనని యాతఁ డొట్టుపెట్టుకొనును (ఇదినాలుగు) ఇక్కడ వ్యవహారము కొంత నిలచును. అమ్మటకిష్టము లేనట్లు దుకాణదారు తీసినగోడుగు మూలఁబెట్టును. కొనుటకిష్టము లేనట్లు కొనునాతఁడు లేచిపోవును. [ఇదియైదు] ఇఁక నిప్పుడెవఁడెక్కువ పేచీకపట్టుఁగలఁడో దాసిపయి వ్యవహారము తేలును. కొనునాతఁడుకొంతదూరముపోయి వెనుకకుఁదిరిగి యింకొకబేరముగుట కుద్యుక్తుఁడై యుండఁగా బేరము చెడిపోవున్న యాదుర్దాతో దుకాణదారు రెండురూపాయలని కేకవేయును. కొనువాఁడు మనస్సునందలి యుల్లాసముతో వెనుకకు దిరుగునుగాని వచ్చినను సరే పోయినను సరే యనునట్టి నిర్లక్ష్యభావము మొగమునందగపఱచుచు రూపాయిపన్నెండణాలకడుగును. (ఇదియాఱు) దుకాణదారు 'తీసికో' యుని యాగోడుగును మీఁదపారవైచి యంతకు ముందటిగోడుగు కొన్నవానికంటె నాలుగణాలు తీసిరొద్దనెక్కువ లాగితినిగదాయని మురియుటతో నీబేరమాఖరగును. ఇందు కొనువానియబద్ధములే లెక్కింపఁబడినవి. అమ్మువానియబద్ధములు మీరేలెక్కించి చూచుకొనుఁడు.

# ఆయఃప్రభావము.



3 వ ప్రకరణము.



మనలో నేలాభమును లేని కొంతమాలినప్రశ్నలు వేయు దురభ్యాసమున్నదికాని శోధనబుద్ధితో విచారించుగుణమంతగా లేదు. అధికప్రసంగమునకు మనవారికిగల వెఱ్ఱి వింతయేకారణము. చూచిన ప్రత్తిగింజనెల్ల బద్దలగొట్టవలెననునట్టి యిట్టి వింతవలన లాభము లేదు సరియేగదా యొకప్పుడు నష్టముగూడ సంభవించవచ్చును. పడవమీదనో యేరైలుబండిలోనో ప్రయాణము చేయుచున్నప్పుడు మార్గవశమున మనతోడి ప్రయాణికులను వేధించువారు ప్రతిదినమును కనపడుచున్నారు. మనవారడుగువానిలో నెక్కువప్రశ్నలితరుని యొడలుమండించునట్టివి. ఈదిగువ ప్రసంగమునుచూచి యిట్టిప్రసంగములను గూర్చి యెవరియనుభవమునకు వచ్చినవి చదువరులు వారే యూహించుకొనుడు.

ప్రశ్న—మీదేయూరయ్యా?

ఉ—మాది కాకినాడ.

ప్ర—మీయింటిపేరేమి?

ఉ—మాయింటిపేరు కనకాద్రివారు.

ప్ర—మాయూరనున్న కనకాద్రివారికిని మీకును నేమైన సంబంధమున్నదా?

ఉ—(ముఖము ముడుచుకొని తనలో వీఁడెవఁడో యధికప్రసంగియనుకొనుచు మర్యాదకొఱకోపికబట్టి) ఏమోనయ్యా నాకు తెలియదు.

ప్ర—అదేమండీ ఇంటిపేరుగలవారినే మీరెఱుఁగరా?

ఉ—మీయింటిపేరటివాండ్రు, మాయింటిపేరటివాండ్రు మాలమాదిగెలలోగూడ నుండవచ్చును. ఇంటిపేరునకును బాంధవ్యమునకును సంబంధమేమి?

ప్ర—ఏమయ్యా అంతకోపము. మాటచెప్పినమాత్రానికే నోటిముత్యాలు రాలిపోవునా లోకములో పాటని యడిగినానుగాని లేకుంటే నీతో నాకవసరమెందుకయ్యా కొట్టితినా తిమ్మితినా? కులమడిగితే కోపమెందుకండి. పోనీగాని మీకేమి యుద్యోగము?

ఉ—నాకు తాలూకాలో గుమాస్తాయుద్యోగము.

ప్ర—ఏమిస్తారయ్యా?

ఉ—30 రూపాయిలు.

ప్ర—తమకేమైనాపిల్లలా?

ఉ—(దైవయోగముచే బిడ్డనుగని భార్య కాలముచేసి రెండు మాసములే యైయుండుటచేత నీయధికప్రసంగమువల

నవానికి మనసునొచ్చుటచే దుఃఖముగలిగి) నీకెందుక
య్యా అనవసరపుప్రశ్న (అని లేచిపోయి దూరమున
కూర్చుండును.)

ఇందుప్రశ్న వేయువానికిగాని జవాబుచెప్పువానికిగాని
లేశమాయినను లాభకరమయినదొక్కటియులేదు.

ఒకవస్తు ప్రదర్శనశాలనో, యంత్రశాలనో, వృక్ష
మునో, లోహమునో, చూచినప్పుడుదానిని పరిశోధించి
వస్తుతత్త్వమును తెలిసికొనుటకై విచారించు గుణము
మనవారికంతగాలేదు ముక్కుమొగము తెలియనివారిని
పైనచెప్పబడినరీతిని వుప్పతిప్పలుగా నేయుద్దేశమును లేని
పెడదప్రశ్నలు వేయుచుండ నాకొక్క ఉత్తమమనిషి దొంగలనుప
ట్టుకొను ప్రచ్ఛన్న వేషముతో నుండి కూపీతీయుచున్న పోలీ
సుభటుడా యనుకొనుటకంటె వేరులేదు ఇటులవ్రాయు
టచే మనవారిలో కొందఱికి మాయందాగ్రహముకలుగు
నేమో. అట్టివారి క్షమాపణకోరనవసరములేదు. నిష్పక్ష
పాతబుద్ధితో శాంతముగ యోజించిన కారణకార్యములను
చూచి దానివలనజ్ఞానాభివృద్ధి చేసికొనుగుణము మనలో
లేదని వారికే తెలియవచ్చును ఒక్క నిదర్శనమును జూ
డుడు. మనలోనింగ్లీషువిద్యనుచదివినవారును చదువనివా
రునుగూడ వాచీలనో, టైంపీసులనో, పెద్ద గడియార
ములనో యొంట, నింట, నుంచుకొనుచునే యున్నారు.
గడియారములయొక్క యుత్పత్తికి కారణమును అవిపాశ్చా

రంభమం దేదేశమందెవ్వనిచే గన్పట్టఁబడినదియు తత్పూ
ర్వమందు కాలమాన మేరీతి దేశములయం దేయేకాలము
లయాదెట్లెట్లు లెక్కించుచుండిరో యీయంశముల నన్ని
టిని తెలిసికొనుమాట యటుండ, తమరెయొంటనో ఇంటి
నో టక్కుటిక్కు మనుచుండు యీనిర్జీవప్రతిమకు కద
లుటకు ప్రాణప్రతిష్ఠ యెట్లుచేయఁబడెనో మరియెట్లు నివాడ
బడు దానిచేతులు కదలుటకు కారణమేమో దానియందే
యే చక్రములకెట్టెట్టు సంబంధము కలదో తెలిసికొనుటకెం
దఱు ప్రయత్నము చేయుచున్నారో యోజింపుము. గడి
యారముల నొసికొని తిరుగువారిలో నొందఱు తక్కువనడ
క నెక్కువగను నెక్కువనడకను తక్కువగను మార్చుకొను
టకైన చేతగాక యట్టిమార్పు చేసిపెట్టుమని యితరులను
దేవురించుచుండుట మనమెఱుగము.

ఒక యాంగ్లేయబాలునకు వాచినొకదాని నిచ్చినయెడల నా
లుగైదుదినములు "టిక్కు టిక్కు" మనియది తిరుగుచుండ
సహించి యూరుకొనునుగాని వారముతిరుగక ముందే డి
ప్పలు చిప్పలునూడదీసి యాధ్వనికిని చలనమునకును కా
రణమేమై యుండునని శోధించి శోధించి తనబుద్ధికి జులవడి
నంతవరకు దానిమర్మమును గ్రహించి తెలియనివిషయ
ములలో పెద్దవారినడిగి తెలిసికొనును. ఇట్లు ప్రతిదాని
యొక్క కారణమును తెలిసికొనుటలో నాబాలునకుబుట్టు
సంశయము లనంతములై యుండి పెద్దవారిని యడుపరీక్ష

ములతో విసిపించుచును. సాయంకాలము వగరును పాటున
డిసాయంత్రమే వార్తాపత్రికనూ చేతబుచ్చుకొనియానం
దముగా కాలముగడపు తండ్రియొద్దకు నాటలో నలసిపో
యి కుమారుడుచేరెనా యాతండ్రిమరవస్థ చెప్ప నలవిగా
దు ఇంకులకుందార్కాణముగా గ్లిబార్లోగారు చెప్పిన
పితృపుత్ర సంవాదమునుం బొందుపఱచుచున్నారము గ
దిలో తండ్రి యీజీచైరుమీాద పరుండి న్యూసుపేపరుచ
దువుకొనుచున్నాడు. ఆసమీపమున బల్లయొద్ద బొమ్మల
పుస్తకము నెదురుగాబెట్టుకొనియాబొమ్మలయందు దృష్టి
తప్పించి కొంతసేపు గోడనున్న గడియారము పైపు చూ
చిచూచి—

కుమా—నాన్నా !

తండ్రి—(తనకత్యంతావసరమైన ధనముతోచేరిన సంగతు
లను జదువుచు తనకు తొందర కలుగచేసినందులకు
చిటచిటలాడుచు) ఏమి, ఎందుకు ?

కుమా—నాన్నా, ఆగడియారము ముండ్లను చుట్టు త్రి
ప్పేది యేది.

తండ్రి—(కుఱ్ఱవానికి జ్ఞానాభివృద్ధిచేయు తలంపుతో శాం
తముగాను, వృథగా తనకాలము చెడిపోకుండునటు
లను) ఏమున్నది, తాళముచెవిపెట్టి త్రిప్పితే స్ప్రింగు
గట్టిగా చుట్టుకొనును గదా. అంతట చక్రములు

గిరగిర దిరుగుచు ముండ్లను త్రిప్పును. (మఱల పేపరు చదువుటకారంభించెను)

కుమా—(ముహూర్తమాత్రమాగి) నాన్న.

తండ్రి—[కొంచెము చీదరతో] మరల యేమివచ్చినది.

కుమా—స్ప్రింగంటే యేమిటి?

తండ్రి—(పితృశాంతముమూర్తీభవించినటుల నొక్కనిట్టూర్పువిడిచి, చదువుచున్న పేపరు విడిచి, గడియారము క్రిందకుదింపి, అద్దపుమూతతీసి, గడియారమును విప్పి స్ప్రింగుచుట్టను పిల్లవానికిజూపించి అది చేయు పనిని బోధపఱచి, యాగడియారమును మఱల నమర్చి, యూడదీసిన యద్దపుమూతను మఱల తగిలించి గడియారమును యధాస్థానమందుంచి, తిరిగి పేపరు చదువ సాగించెను.)

కుమా—(మఱియొక ముహూర్తమునాగి) నాన్నా!

తండ్రి—(పండ్లుగొఱుకుకొనుచు) ఇంకేమి మునిగినది?

కుమా—ఇటునటునాడు మొండెపుయా బంగారపుబిళ్ళ సంగతి చెప్పినావు కావు.

తండ్రి—(ఒడలుమండి) ఏమిపాపము వచ్చింది. ఇదిభరించుట— (అంతటితో కోపము నడచుకొని) నాయనా! నీకు నిద్రబోవుయ్యే సమయమైనది. ఆచిన్న బంగారు బిళ్ళను గుఱించి యింకొకనాడు చెప్పెదను. [ఇట్లనుచు పరిచారికకొఱకు గంటవాయించుచున్నాడు.]

(అంతట దాదివెంట బాలుఁడు వెళ్ళిపోవుచున్నాఁడు)

మనలోనిట్టి ప్రశ్నలనడిగి వస్తుతత్త్వమును తెలిసికొను బుద్ధి మనబాలురకులేదు. నూటికొకఁడో కోటికొకఁడో యట్టివాఁడుండినను చెప్పఁగలిగినశక్తి పెద్దవారికుండదు. శక్తి కలిగియున్నను తగినయోపికయుండదు. అసలిట్టిప్రశ్నలను వేయు శిశువుల నధిక ప్రసంగులుగనెంచి క్రేలు కణిపెకులేవు పెద్దవాళ్ళు పోయెదవా, నీకెందుకురా కొఱమాలినప్రశ్నలు, అని నోరు మూయించుచు నేప్రశ్నలనువేయక తోడిబాలురతోనైన గంతులు వేయక ముడుచుకొని మూలఁగూర్చుండియుండు పుత్త్రునిగుణవంతునిఁగా నెంచుచుందురు. ఇప్పుడిప్పుడట్టి దశమారి పెద్దవారు చిన్నచిన్న సంగతులు పిల్లలకు నేర్పుచుండుటచేత నేర్చుకొనుబుద్ధిపిల్లలకును బొడము చున్నయది. ఈగుణమును వృద్ధిపఱచుటమిగుల యావశ్యకము అట్టిజ్ఞానోదయము శిశుసామాన్యమునకు కలుగవలెనంటిమా తండ్రులకన్న తల్లులెక్కువగా దీనినిబలపఱుపవలసిన వారుగానున్నారు. పిన్నవయస్సునందేయొకటి రెండుగడియలు బాలుఁడు తండ్రియొద్దచేరునోగాని తక్కినకాలమంతయు తల్లిచెంత చేరియుండునుగదా!

పిన్నవయస్సునం దెట్టిశిక్షకలిగిన పెద్దతనమున నాదారినే వానినడవడియుండును అందుచేత విద్యాగంధమెఱుగనిమూఢస్త్రీలచెంత పెఱిగినపిల్లలకు నాస్త్రీలవలెనే ప్ర

తిదానినిగూర్చియు తప్పగునభిప్రాయములే కలుగుచుం డును. ఆకాశమున మబ్బుగ్రమ్మి పెళపెళధ్వనితో నురుము వినబడిన కొడుకు బెదరి తల్లికంఠము కౌఁగలించుకొని నిలువుగ్రుడ్లుపడి మిన్నువంక జూచి "అమ్మాయది యేమి" అనియడుగ "జడువకు నాయనా" యని వెన్ను పైని మూడుచఱపులుచఱచి దేవేంద్రుని రథము పోవుచుండగా శిలయూడిపడ్డదనుకొని అశీల తనమీదను తనబిడ్డమీదను పడకుండుటకు ఇంద్రపుత్త్రుఁడైన యర్జునుని పేళ్ళన్ని యుదల చుకొని విపత్తుతప్పించుకొనినట్లు గుండెలు కునుటబఱచుకొనును. కావున న్యాయమగుశోధనశక్తి పిన్నవయస్సునందే కలిగి పెద్దవారయిన వెనుక ప్రకృతిశాస్త్రాదులయందు ప్రవీణులగుటకు స్త్రీలు విద్యావతులుగావలయును.

స్త్రీలబలలని వాడబడుచుండినను వారిలోనధికాబలయగు స్త్రీపురుషులలో బలతమునికంటె మిగుల బలవంతురాలయి యుండుననిరొుక గ్రంథకర్త వ్రాసియున్నాడు.

"స్త్రీణాం.....బుద్ధిశ్చాపిచతుర్గుణ" సాహసంషడ్గుణంచైవ.....భవేత్" అనునట్లు విద్యగఱపినచో స్త్రీలకు జ్ఞానాభివృద్ధికలుగుననుటకు సందియ మేమియును లేదు. అట్టి జ్ఞానాభివృద్ధికలిగి యుక్తాయుక్తములు బాగుగ యోజించుశక్తిగలిగినప్పుడు దేశోపయోగకార్యములు చేయుటకు వారిసాహసము తోడ్పడకమానదు.

అట్టిజ్ఞానము మనహానము మ స్త్రీలకు గలిగియున్నప్పుడు పురుషుల యత్నములు తప్పక కొనసాగును దేశాభివృద్ధికి సాధనములగు నెన్నెన్ని గొప్పయుద్యమములు స్త్రీలమౌఢ్యమువలన చెడిపోవుచున్నవో తలంచుడు. పైనచెప్పబడిన యాంగ్లేయబాలుడు గడియారము విషయమై తెలిసికొనియంతటితో నిలువక యాగడియారమునందలి లోహములనుగూర్చి ప్రశ్నలు చేయ నారంభించి యాలోహములకు స్థానభూతమైన భూమియందలిపొరలయొక్క తత్త్వమును కనిగొని భూశాస్త్రజ్ఞుడగుటకు చిన్ననాటి ప్రశ్నలే హేతుభూతములుగదా?

ఇట్టి గుణము హిందూబాలురయందుద్భవించి పొంపుచెందవలసియున్నది. అక్కడక్కడ నెక్కడనో యొక్కొక్క బాలున కీగుణము కలుగుటయే దీనియభావమును సూచించుచున్నది. ఇట్టిజ్ఞానముద్భవింపక పోవుటకుగల హేతువుల నొకొంత విచారింతము. దీనికి ప్రధానమగునది మనలో జాతిమతభేదము లేర్పడి బ్రాహ్మణులు భూదేవులను నమ్మకము గలిగి యేయంశమునందైనను వారు చెప్పినమార్గమున పోవుట యేనీతియని ధర్మశాస్త్రములు చాటుచుండుటచే నీగుణమున కవకాశమంతయును లేకపోయినది. మన వేదాంతప్రకారము ప్రకృతియంతయు నసత్తనియును ప్రకృతిని విసర్జించి కాంక్షలత్యజించి యోగియై పరమాత్మయందైక్యమగుటకు ప్రయత్నము చేయుటకన్న వేఱొక విధికృతము

లేదని యోగశాస్త్రము ఘోషించుచున్నయది. ఐహిక మునుండి యాముష్మికమునకేగయు మార్గమవలంబించుట దుష్కార్యమని యెవ్వరును చెప్పజాలరు. కాని గృహకృత్యములను లౌకిక ధర్మములను విసర్జించుకొని ప్రతిమానవుడును చెట్టుకొకడుగను పుట్టకొకడుగను చేరి కన్నులు మూసికొని కదలకుండుట లోకవ్యవహారమునకు ననర్థదాయకము. ఇచ్చట యోగాభ్యాసము యొక్క గుణాగుణములను విమర్శించుట మాపనిగాదు ముక్తిసాధనము లెవ్వియైనను యోగులచర్య లెట్లుండినను లోకులందఱును యోగులై విరాగులు కారుగదా! సంసారసంపర్కము నుత్యజించిన బ్రహ్మచారులు పరివ్రాజకులు మొదలగువారికి తీర్థయాత్రలకును భిక్షులకును యథావిధిగా గృహస్థాశ్రమము నవలంబించిన సంసారులుండక తీరదుగదా! ఈసంసార మొకసాగరమువంటిది దీనిదరి జేరుట దుర్లభము. ఈసంసారమును భరింప వలసినవారి యర్హకృత్యములు పలువిధములై యున్నవి. జనకునివంటి భక్తివైరాగ్య సంపన్నుడుగూడ లౌకికవ్యవహారములను రాజ్యభారమును వహించి శ్రద్ధతో జరిపెను. గృహస్థాశ్రమమునుండి పరమభాగవతోత్తముడైన వాడేయుత్కృష్టుడని మనమతము చెప్పుచునే యున్నది. కాబట్టి 'శరీరమాద్యంఖలు ధర్మసాధనం' అనువచన ప్రకారమే ధర్మమునకైనను దేహబలమును బుద్ధిబలమును విధిగానుండవలయును. తానెంతనీతిపరుడైనను తినుటకన్నము

సంపాదించు కొనకుండుట కైశ్వర్యానికిని పీలులేదు. లోక మందు పెంపుచెందిన శక్తియుక్తులయందును నైశ్వర్యము నందునునితర దేశములతోడ దుల్యదూగి, కొన్నిటియందైనను మార్గదర్శిగా నుండవలయునన్న నైహికాభివృద్ధిగూడమ నకవసరము.

వట్టియైహికాభివృద్ధికొరకే మనుజులును, సంఘములు నువ్యవహరించినయెడల లాభములేదు. ఏకార్యములయం దును నీతివిడువరాదు. లాభమును మాత్రమెచూడకమంచి దారినియభివృద్ధిని యుత్తమజీవనము నొందిమానవజన్మము సార్ధకముగా జేయుట యత్యంతావసరము.

యోగ్యతా రహితమగు బలము నైశ్వర్యమును ము ప్పునకే కారణములగును. సకలైశ్వర్యములతోడను దుల తూగుచుండి యింద్రాదులజయించిలోకమును గడగడవ డకించిన రావణాసురుడు సుగుణవిరహితుడగుటచే నెట్లు నశించెనో రామాయణమునెఱింగినవారికివిశదమే. దయా మయుడైన పర్మేశ్వరునిచే సృజియింపఁబడిన యీవిచిత్ర ప్రపంచమునందుగల సకలపదార్థములనుమనకు ప్రసాదిం పబడిన బుద్ధిచే లోకాభివృద్ధికై వినియోగించుట నీతిగాని యట్టివానిని యనర్హములనివిసర్జించుట నీతిగాదు. ఒక్క సంసారమునకు సుఖజీవనము కలుగచేయవలయునన్న నె న్నివృత్తులు వలయునో యోజింపుడు. మన వేదాంతము గొప్పదిగావచ్చును. మనగీతలు, భాష్యములును వెూ

క్షమార్గదర్శనములు కావచ్చును కాని కాలచక్రముతిరుగుటలో మనకుగలిగిన మార్పువలన గోముఖము చేతికి దగిలించుకొని తావళముద్రిప్పుచుండిన వ్యవహారముసాగదు. కొన్ని సంవత్సరముల క్రిందటివరకు హిందూదేశ మొకరీతిని బాగుపడుచు వచ్చినది కాని దివ్యజ్ఞానసమాజమను పేర 'తియసాఫికల్ సొసయిటీ'యనునది బయలువెడలుటచే మన యభివృద్ధికి కొంతియడ్డుగలిగినదని మాయభిప్రాయము.

ఇట్లయియితరసమాజములకన్న నీదివ్యజ్ఞాన సమాజమును దెక్కువదోషమున్నదనికాను దానిమంచిచెడ్డలనిక్కడ విచారించుట కవకాశములేదు, కానినిన్న మొన్నటివఱకు మద్యపానముచేసి గోసూకరమాంసములకుత్తింభరత్వము జేయుచుండిన యన్యదేశీయులగు స్త్రీపురుషులువేము మనయోగాభ్యాసముచే నాత్మసందర్శనముచేసి యనేకవేలయేండ్లకుముందు ఘటములనువిసర్జించి సూక్ష్మశరీరధారులగు మహాత్ములతోఁ గలిసి ప్రసంగములు సలుపుచుండి దూరదృష్టి, దూరశ్రవణాది మహాశక్తులను బొంది మానవుపదేశకర్త లగుచుండ నాసమాజమునజేరి యట్టివారిచే నుపదేశములను బొంది వారిలోఁ బురుషులకు యజ్ఞోపవీతధారణమును, స్త్రీలకుఁ బసపుకుంకుమయును ప్రసాదించి వారినుత్తమ బ్రాహ్మణులుగా నెంచుచుండెదు నీదివ్యజ్ఞానసామాజికులలో పలువురు జాతి మత భేదముల వలన కలుగునష్టములను గ్రహియించి అన్యదేశయాత్రలు సలిపి

సంఘమును చక్కబఱచుకొనఁ జాలకున్నారు. అన్యదేశ
ముల నుండి యిక్కడికి దిగుమతి చేయఁబడిన దివ్యజ్ఞాన
ము స్వతస్సిద్ధముగ సారవంతమాయినదై యుండవచ్చును. ఎ
ట్టిపుష్టిగలబీజమయినను నిస్సారమగుభూమిలో నాటినపుడు
మొలకయెత్తుటయే కష్టము ప్రబదికిచెట్టగుటతటస్థించెనా బ
దనికలును వెఱ్ఱితలలును వేసి ముక్కమూతిపిండెలను కాయ
ను గాని రసవంతములగు ఫలములనీయదు గదా! పలుకా
రణములచే నిస్సారమగు హిందూబుద్ధియందెట్టి సారవంత
మయిన బీజమును నాటినను నాటినవాని యుద్దేశమును నె
అవేర్చి ఫలమునీయజాలను ఈదివ్యజ్ఞానసమాజమునందు
ప్రవేశించిన మనవారిలో ననేకులు మాధ్యము సేవించియుం
డి సముద్రయానమునకును అన్యదేశయాత్రలకును దురా
చార విసర్జనమునకును శత్రువులునుగనున్నారు దురాచా
రములనే వృద్ధిచేసికొనుచు నైహికాభివృద్ధి విషయమయి
ంపుచెందుచున్న యితరదేశములతో కలిసికొనుటకుఁ దగి
జాలకున్నారు. "రామ" "కృష్ణ" యని ముక్కుమూసికొ
నిమూలలకూర్చుండుటవలన దేశాభివృద్ధి కలుగనేరదు. కాల
ము మాఱినది. ఇప్పుడు జపాను దేశస్థులకుగల కీర్తిప్రతిష్ఠ
లును, శక్తియుక్తులును, సర్వవిద్యాభివృద్ధులును చూచి సం
తోషించినలాభము లేదు ఆ దేశమునకట్టి యభివృద్ధి కలుగు
టకుగల కారణములను తెలిసికొని యన్యపరిపాలనము క్రిం
దనుండుటవలన సర్వమునకు ప్రభుత్వము వారిమీదనే భార

ముంచక స్వప్రయత్నమువలన పలువిధములైనపనులుచేసి
కొనునట్టి యవసరమిప్పుడు మనకు గలిగినది. శాస్త్రపు
రాణములయొక్కయు, వేదములయొక్కయు, ఘోషకొం
చెము వెనుకనుంచవలయును. ఇప్పుడు ప్రపంచమునాక్రమించు
చున్నయదియినుము. వేదాంతమునే ప్రధానముగా జేసికొని
కాలమంతియునందుక్రింద నే వ్యయపెట్టుచున్న దేశమభివృ
ద్ధియెట్లుచెందును? మనలపరిపాలించుచున్న యాంగ్లేయు లెం
తకాలమువేదాంతమే ప్రధానవిద్యగానుంచుకొని వ్యవహ
రించుచుండిరో యంతకాలము వారిదేశము పెంపుచెందక
ప్రకృతిశాస్త్రజ్ఞానమభివృద్ధినొందియంత్రసాధనములేర్పడి
నమూడునాలుగు శతాబ్దములనుండిదినదినప్రవర్ధమానమ
గుచున్నది. కావున మతమును దూషించితిమనియు నింటి
గుట్టు బయటబెట్టితిమనియు మమ్ములనిందింపక కన్నులు
దెఱచి నలుదెసలు పరికించి, యిప్పుడు లోకమందు ప్రవ
హించుచున్న ప్రకృతి శాస్త్రజ్ఞానమును అందునుండిబ
యలువెడలిన యంత్రశాలాభివృద్ధిని బాగుగకనిపెట్టి అ
యఃప్రభావమును కన్నులారజూచి కాలవారాశిలో తే
లిదరిజేరుటకు తగుప్రయత్నమును చేయకున్న నడుగంట
క మానము. ఇట్టిదశమనకు రానలయునన్న నిదివరకు చె
ప్పఁబడినటుల స్త్రీవిద్యకును, ప్రకృతిశాస్త్రజ్ఞానమునకు
పూర్ణమైన సాధనముల నేర్పఱచి చిన్నవయస్సునుండియు
నా నల్లనివన్నియును నీళ్ళును తెల్లనివన్నియును పాలున

నుకొనక, మనము చూచినదానిగుణతత్వములవల్ల సంపూ
ర్ణముగా తనుగొనుశక్తి మనవారికి కలుగజేయవలయును.
ఇట్టి విచారణగుణము లేకుండుటకు మఱియొక్క కారణము
గలదు ఈదేశమున జీవనమునకు వలయుపదార్థములు బ
హుస్వల్పములు. ఉన్నదానికన్న వస్తువులనభివృద్ధి నొందిం
చవలసిన యవసరమంతగా లేకుండుటవలన నిట్టిగుణము
న కవకాశము లేకుండినది. ఈభరతఖండము నందెక్కువ
ప్రదేశములయందు చలిబాధ లేకుండుటచేతను కొన్నిప్ర
దేశములయం దుష్ణమధికముగానుండుటచేతను వస్త్రధా
రణము మానమును కప్పుకొనుటకు మాత్రమే యవసర
ముగా నేర్పడినది. ఏసాలెవాడునేసిన వస్త్రమైన నందు
లకుచాలియుండుటవలనచలిదేశములయందు వసించు జను
లవలె చలిబాధతప్పించుకొని యారోగ్యముగ జీవించుట
కవసరమయిన వస్త్రములను తయారుచేయుటకు సాధన
ములగు యంత్రములను కనిపెట్టి నానాట యభివృద్ధి
చెందించుచుండుటకు బుద్ధిని వినియోగపఱచవలసి నట్లుమ
నకట్టి యవసరము లేకపోయినది. కొంతకాలమునకు పూ
ర్వమెచ్చట జీవించువారి కవసరమయినపదార్థము లచ్చ
టనో యాసమీపముననో దొరకుచుండుటచేత వీరను
భవించెడు వస్తువులును మిక్కిలికొద్దివిగానుండెను దానిక
నుగుణ్యముగనే వర్తకవ్యాపారముండి కూలివాని భుజము

గంతయెద్దు, గూటిబండి, యీవర్తకపు సరకులను మో యుటకు సాధ్యమైయుండినవి. ఎక్కడనో యెక్కడుప్ర యాణము చేయవలసివచ్చి నడవజాలకుండిన మోటుబం డిలోనో సవారిలోనో పోవుచుండెను కాబట్టి యెక్క వసరములను తక్కువఖర్చుతో నతిస్వల్పకాలములలో నె గుమతి దిగుమతులు చేయుటకును కాలమును, వృథావ్య యము చేయక తక్కువ తగువ బాటుతో దూరప్రయాణ ములు చేయుటకును దివారాత్రములు సాధన చేయవల సిన పని మనవారికంతకు పూర్వమవసరము లేకుండినది. కాని, యంత్రములను చేకట్టుకొని యన్యదేశీయు లి క్కడకు దిగియిక్కడ తిష్ఠవేయ మొదలిడినారు. యం త్రశాలలేర్పడు చున్నయవి. రోడ్లు, ఇనుపదారులు, కాల్వలు, ఆనకట్టులు, మొదలగునవి వెలసినవి వర్తక వ్యాపారమెక్కువైనది. ప్రయాణములు సులభమాయెను. అవసరవస్తువు లభివృద్ధియగుచున్నవి. పాతపద్ధతులతో జీవనము చేయుటయందుదృష్టి తప్పుచున్నది దేని తోడ ను సంతుష్టిపడి యూరకుండక యెక్కువయందాశ పుట్టు చున్నది. కొద్దివస్తువులతో సంతుష్టిపడి జీవనము చేయు చుండెడు పూర్వులకును అభివృద్ధికై పెనుగులాడుచుండు మనకును సుఖమునందు తారతమ్యమెట్లుండినను మనము స్వప్నతేచి యిప్పటికాలమున కనుగుణ్యముగ నడవడి

మాఱ్చుకొని చాకచక్యముగా పనిచేయవలయును లేదా
కొద్ది కాలములో రూపుమాసి పోనైనను పోవలయును.

దీనికిఁగూడ దనహేతువు మనవాఁడికిగల పరమశాంతతయు
ననవచ్చును. మండువేసవిలో నుదయము మొదలు సాయం
కాలమువరకు నెండఁగొనిఁబడి యేతాము తొక్కుచు
నో గూడకట్టి తనవరిపొలమునకు కాలువలో నీరెక్కిం
చుచునో యుండుటకలవాటుపడిన వానికి గల శాంతము
పాతాళమునుండి గంగను పైకిదీయవలసినంత యవసరమా
తని బుద్ధికెన్నఁ స్ఫురింపఁజేయును. ఒక్కొక్కప్పుడు గానల
సినదూరమును మూఁడుదినములవరకును "తుక్కు" "తుక్కు"
అని కొట్టుకొనుచుండు దూదేకుల వానికిని, ఒక్క
పంచల చాపు నేయుటకు వారము దినములు సన్నపు
గోతిలో శాంతముగ గూర్చుండి పట్టువానికిని
12 మైళ్ళప్రయాణము చేయుటకు 12గంటల కాలము పో
తులబండిలో కూర్చుండెడి వానికిని దూదేకులదండెను
మగ్గమును బండిని వృద్ధిజెందించుకొను యోజనపుట్టనేర
దు. ఒకవిధముగా శాంతగుణము మంచిదగాని యిట్టిశాం
తతవలన ప్రయోజనములేదు. దీనిని విసర్జింపవలయును. క
ష్టములకోర్చి పూనికతోఁ బనిచేయుచు నితరులు తమకొను క
ల్లలకును నాక్షేపించునిందలకును సంకుగొనక పట్టినపట్టు
విడువక పూనినకార్యమును చేయు శాంతము శాంతము

గాని యెక్కడున్నావు కంబళియనిన వేసినచోటనే గొంగళి" యనుశాంత మడియా వహించియుండినవారిని నిర్ధులజేయును. ఈపాడుశాంతమును పారదోలువరకును మనకు గలజీవనాధారములను పెంపుజెందించుకొనుట యెటులని యోజించు గుణముద్భవిల్లదు.

నాల్గవ హేతువు, పూర్వాచారావలంబనము 'ఏపనిని చేయబూనినను దానిమంచిచెడ్డలను యోజించక యదివఱకిది మనలో లేదుగనుక నీకమ్మంగూడను అవలంబించమనుట. ఇదినుంచిని యాపుట్టియుండే విశేష ముపయోగపడుచున్నదిగానిదోషావలంబనమున కెంతయూ త్యుతమును నిరోధముగాజాలకున్నది. ఇంటిభోజనకాలమందాంగ్లేయ భాషనుచ్ఛరించినదోషమునుకొని 'హరిహరా' యని చెవులుమూసికొను వారాంగ్లేయ భాషయందారితేరిన వారిలోనే కన్పట్టుచున్నారు. ఇక వైదికులమాట చెప్పనక్కరలేదు. కాని వీరబుద్ధి కుశలతయు, యోగ్యతయు, గుణాగుణ విచక్షణ శక్తియునెట్టిదో చూడుడు. మడికట్టుకొనియున్న కాలమందింగ్లీషు భాషతో వ్రాసిన కాగితములను ముట్టకు కాని యింగ్లీషు పదములతో నిండియున్న కాసులను, రూపాయిలను డబ్బులను దేవతార్చన పెట్టెలలో పెట్టుటకు సంశయించరు పితృకార్యములయందాయింగ్లీషు పదములతో నంకిత నాణెములు గడిగిన నీళ్ళతో తమపెద్దలను స్వర్గ

ముచ్చుబంపుదురు. మఱికొందరు కిరసనాయిలును, కిరస్తానీ చమురని విసర్జింతురు. క్రైస్తవుల చేతినీరు దాగ్రిన టయిట్టి మహానుభావులకు దోషముగాని మాలమాదిగెలచే నింగ్లీషుకంపెనీలలో తయారుచేయబడిన సోడా లెమొనెడ్డు బుడ్లను త్రావుటకు వెనుదీయరు. ఇందు రెండు తరగతుల వారికి బయలు దేరినారు ఒకరు సోడాను వేరొక గ్లాసులో పోసికొని త్రాగువారును రెండవవారా బుడ్డి యశుచిగానుండ దానిని తామే విప్పుకొని దానితో నే త్రాగువారును. సాతెవాని మగ్గమునకుగాని కుమ్మరవాని సారెకుగాని కంసాలివాని పట్టెడకుగాని ఏమాత్రము మాల్య చేసినను దానితో పనిచేసినపాపమని వాడు దానిని విసర్జించును. ఇప్పుడిప్పుడట్టి దురభిప్రాయములు పోవుచున్నను దురాచార పిశాచకంకను జనులనావహించియేయున్నది.

ఆఫ్రికా, అమెరికా, దేశములయందు ఐరోపావారు ప్రవేశించు కాలమున నక్కడ నివసించుచుండెడు అడవి మనుష్యుల వంటి వారము మనము కాము. వారు సర్వవిధముల పశుప్రాయులుగ నుండుటచే పాశ్చాత్యులపద్ధతులన్ని యన్నిటియందును పూర్ణముగ నవలంబించి స్వజాతిపద్ధతుల రూపుమాపుకొనవలసివచ్చినది. మనకట్టి దుర్దశలేదు. మనలనిప్పుడు పరిపాలించుచున్న యాంగ్లేయులొక జాతిగానేర్పడక పూర్వమే యనేక వేలసంవత్సర

న టితప్రయత్నము చేయువారే. అందుచేత నన్యదేశాభివృద్ధికి హేతుభూతములగు పద్ధతులలో వేనిని దేశకాలపాత్రములు గనిపెట్టి మనకనువలంబించి మనకనుగుణముగ రీతిని వృద్ధిచేయుట యెట్లని యోచించుచు గుణగ్రహణమునకై వస్తువిచారమును చేయుజ్ఞానము మనలోనింకను పొడసూపకున్నయది. పరీక్షలకు జనువిద్యార్థులలో నాపరీక్షలకు వలయు గ్రంథములను వల్లించి తలపండకున్న కొన్ని పరీక్షకాలములో గ్రక్కియుంతటితో పొట్టచేతబుచ్చుకొని కచేరీలవెంటబడి కన్నకన్నవాని నాశ్రయించి కడుపునింపుకొనుచుందురు. లోకోపకారకార్యములు చేసినవారియొక్కయు దేశాభివృద్ధిసాధనములగు యంత్రములను గనిపెట్టినట్టియు ప్రపంచయాత్రలను సలిపి సర్వదేశములను పరిశోధించి తమజ్ఞానమును ప్రపంచోపయోగమునిమిత్తమై ప్రసాదించినవారియొక్కయు జీవితములు చదువుటయన్న తలనొప్పి; యంత్రములను పనిముట్లను జూచినచీదరి; చెట్టయి వంగనిది మ్రానయి వంగునా యనునట్లు వెన్నుముదిరి మీసములును గడ్డములును బలసి పండినవాని బుద్ధులు బాగుపరచుటకు కాలదోషము పట్టినది. మన యాశలన్నియు నీ బయలుదేరుచున్న పిల్లలయందే యుంచుకొనవలయును. వారిని బాగుచేయుటయే మనదేశమును బాగుచేయుట.. ఇదివరకు కాలేజీలయందును స్కూ

శ్యయంమును నేర్చుకొనినవిద్య న్యాయమగువిచారణ శక్తి వికలుగఁజేయఁజాలకుండుటచే నట్టిశక్తికల్పించుటకు సాధనమగు విద్యను మనబాలురకొసఁగునట్టి ప్రయత్నమును దేశాభిమానులగువారు చేయుటవిధియైయున్నది.

మనము బాగుపడఁ దలచుకొంటిమా వస్తువిచారగుణము వర్ధిల్లఁ జేయవలయును.



# అయఃప్రభావము.



## 4వ ప్రకరణము.



వెనుకటి ప్రకరణమందు చెప్పఁబడిన ప్రకారము వస్తుమర్మములన్నియు మూలముట్టుగ తెలిసికొను నభిలాష మనమున జనించుటచే చిన్నవయస్సుదాటులోపలనే పలువిధవస్తుతత్వముల బాగుగ దెలుసుకొని జ్ఞానాభివృద్ధి కలుగుటచే నట్టిజ్ఞానము లోకోపయోగమునిమిత్తము వినియోగపఱచుటకవకాశము కలుగును.

ఇంత తెలిసికొని మన్నుదిన్న పామువలె పడియుండువాడెవ్వడునుండడని మాయభిప్రాయము. ఎక్కడనోయొక్కడట్టివాడుండినను వానిజీవనము మృతతుల్యము. లోకమును బాగుపరచి ప్రజాసౌఖ్యమునైశ్వర్యమును పెంపుజెందించుటకు మార్గములనేకములుగలవు. విద్యయెంతచదివినను లోకోపకారచింతనకెంత మనము పురికొల్పుచున్న నిప్పటిలోకావస్థనుబట్టి ధనసహాయములేకయే గొప్పయుద్యమమునుకొనసాగించుట దుర్లభము. ఇటువంటిజ్ఞానాభివృద్ధిగలవాఁడైశ్వర్యసంపన్నుఁడుగూడనయ్యెనా తనధనమును త

నలాభమునకును దేశాభివృద్ధికినిగూడ వినియోగపడుపజా లియుండును. మూషకమార్జాలముల కెట్టియనుబంధము గలదో యత్తకోడండ్రకట్టి యైకమత్యముగదా! అందుచే పౌరాణికబాంధవ్యమీవిధముగానేర్పడియున్న యత్తకో డండ్రకు పొత్తెట్లుఘటిల్లును? లక్ష్మీసరస్వతు లత్తకోడం డ్రగుటచే నెక్కడనోపూర్వజన్మసంస్కారముగల కుటుం బములయందుదప్ప వీరిద్దరికిని పృథక్భాండాశనమే గతియై యున్నది ధనవంతు లగువారికి విద్య యుండుటయు విద్వాంసులుధనవంతులగుటయునఱిది. అందుచేపైనచెప్పఁ బడినరీతిని జ్ఞానాభివృద్ధినికలుగజేసికొనజాలిన మనవారిలో ననేకులు తమ యుద్యమములను కొనసాగించుకొనజా లినంతటి ధనములేక గుడ్లుమిటకరించుకొని చూచుచుం డవలసినవారుగా నున్నారు. అనకాపల్లిలో చంద్రశేఖర శాస్త్రి బోర్డింగు హైస్కూలునకు ప్రథమోపాధ్యాయు లగు రామమూర్తిపంతులుగారికి ధనముండిన విద్యార్థుల నెట్టిదశకుతేగలుగుదురో వారినెఱిఁగినవారికెల్లరకును విశ దమే. ఆయన సహోదరుఁడగు సూర్యనారాయణరావు గారు పెన్సిలుఫ్యాక్టరీ నొకదానిని ఉత్తరసర్కారులలో నిర్మింపఁదలంచి సకలకష్టములకోర్చి యాఫ్యాక్టరీ విష యమై తెలిసికొనదగిన సమస్తసంగతులును బాగుగతెలి సికొని జమీందారులతోడను, లక్షాధికారులగు వైశ్యులు మొదలగు వర్తకులతోడను, నిండియున్న మనయుత్తరస

కార్ఖానులలో తక్కిమన్న పొడిమన్నగాదిరిగి యట్టిఫ్యాక్టో
రీని స్థాపించుటకు కావలసిన స్వల్పమొత్తము నే జమచేయ
లేక యీమధ్యను కలకత్తా, బొంబాయి, మొదలగు దేశ
ములయందుఁ దిరుగుచు సంచారకాలములో క్రిందటిసంవ
త్సరము డిశంబరునెలలో జరిగినయిహలోక వైకుంఠ
మనదగు బొంబయిపట్టణవస్తుప్రదర్శనశాలలో మాకగు
పడి యీపెనసళులశాలనుస్థాపించుపనిమీఁద దేశముసందిరు
గుచు కాంగ్రెసుమహాసభకొఱకును, వస్తుప్రదర్శనశాలజూ
చుటకును తాముబొంబయివచ్చితిమనియుబొంబయిప్రసిద్ధ
న్ని అసోసియేషనుకు ఆనరెరీ శెక్రెటరీయగు దిన్‌షాయెదు
ల్జివాచాగారుమొదలగు లోకోపకారధురీణులవలన తా
ము స్థాపించదలచుకొన్న ఫ్యాక్టోరికి వలయు సంగతులును
నేర్చుకొని దేశమునకువచ్చుచున్నామనియు మన దేశమం
దీ ఫ్యాక్టోరికివలయుధనము సమకూడనియెడల ప్రజలకుగ
ల మాాధ్యమును లబ్ధత్వమునుపోగొట్టుటకైయట్టియంత్ర
శాలకు వలయుధనము కలకత్తాలోనిలోకాభిమానులుకొం
దరిచ్చుటకు వాగ్దానమొనర్చియున్నారనియుయీయనవలన
విన్నసంగతియిచ్చటచెప్పుటకెంతయుసిగ్గగుచున్నది ఘూని
కవిడక పనిచేయుచు అనకాపల్లిలోయంత్రశాలనుకట్టుచు
న్నారు. మనకృష్ణా గోదావరి, విశాఖపట్టణము, గంజాంజిల్లా
లయందెందఱోజమీందారులున్నారు. వారికిప్రతిసాలునవ
చ్చునాదాయముయంత్రశాలలనుస్థాపించుటకుపయోగించ

కున్నదిగాని కోడిపందెములయందును, కౌజు పిగిలిపిట్టల లడాయిలయందును, పొట్టేళ్ళపోట్లాటలయందును, అధిక జూదములయందును, ఆజూదములకన్న నెక్కువ నాశన హేతుభూతములగు వ్యాజ్యములయందును దుర్వ్యసనలోలురై కలధనమును కడిగివేసికొనుట కుపయోగపడుచున్నది. అట్లుగాక ధనమునిలువచేసినయెడల షాహుకార్లలోకొందఱు లుబ్ధాగ్రేసరులై తమపొట్టకయినను తినక సంచులను దినదినమును తిరుగబోసి చూచిసంతోషించి మఱలసంచులకెత్తి మూతులబిగించుచున్నారు. మఱికొందఱుమార్వాడీలనుమించి యొడ్డిబేరములాడుచున్నారు. అట్టివారికి లోకోపయోగమునుగూర్చి యొకపనిని చేయబూనుకొనిన వారు దానిమంచిచెడ్డల నెంతవివరించిచెప్పినను వారావలకు పోవేగమే దానినిజస్థితిని తెల్పుమని తమ్మాశ్రయించియుండెడు నభిమానపు కాసాలనడిగి వాడిమాటను వేదవాక్యముగానమ్మి అట్టికార్యములనిరసింపుచున్నారు. భాష్యమయ్యంగారువంటి లాయరీ దత్తత చేసికొనవచ్చునని గాని కూడదనిగాని యీవ్యాజ్యము తేవచ్చుననిగాని తేకూడదనిగాని యభిప్రాయమునిచ్చినను, యట్టియభిప్రాయమున కధికధనము వారికి ఫీజుక్రింద నిచ్చియుండియు నేకాంతమున తమకత్యంతప్రియుడగు కాసానుబిలచి ఏరా, అయన చెప్పినాడుగాని దావా తెమ్మంటావా వద్దంటావా అనివాడులాయరభిప్రాయము మంచిదని యొప్పుకొనువరకు నావ్య

వ్యాపారమును తలపెట్టనివారు కొందఱున్నారనుటకు సంది
యములేదు. అతినాగరీకులై యూరోపాఖండము మొదలు
గు నన్యదేశ యాత్రలసలిపిన వారింతమూర్ఖతలోనుండక కం
ఢినను జమీందారీవాసన పూర్ణముగా విడువకుండుటచే
త పేరుప్రతిష్ఠలకై యున్నతరాజకీయోద్యోగులు సంతో
షించు కార్యములను జేసి కితాబులకై పాటుపడుచుందురు.
ఒకరిద్దరు పురమందిరములు కట్టించుటకు వేలకొలది ధన
ములను వెచ్చించుచున్నారు. అట్టిపురమందిరముల వలన
లాభములేదనియు నట్టివానిని కట్టకూడదనియు మా
యభిప్రాయముగాదు. అంతకన్న నెక్కువధనము యంత్ర
శాలలను స్థాపించుటయందు వినియోగపఱచి తమజమీ
నులలోని ప్రజలకైనను నట్టికంపెనీలవలన గలుగులాభ
మును గనపఱచి జాయింటుస్టాకు కంపెనీలయందు ప్రజ
లు సొమ్మును వేసికొనునట్టియలవాటును వారికి కలుగ జే
యుటయంతకంటె నెక్కువయవసరమైనకార్యము. జమీం
దారీలతో నిండియున్న విశాఖపట్టణము జిల్లా యందలి
మాంగనీను అనులోహము త్రవ్వియితరదేశములకు కెగు
మతిచేయుటకు యీస్టుకోస్టురైలువేకుతండ్రియని ప్రఖ్యా
తిగాంచిన టర్నర్ దొరవారి ప్రోత్సాహమున నాంగ్లేయు
లుపనిచేసిధనవ్యయము చేసిలాభముపొందుచున్నారు కా
నిజమీందారు లిట్టికంపెనీల నేర్పఱచుటకు కలసిరాకున్నా
రు. ఈహేతువులచే విద్యావంతులగు దేశాభిమానుల యొ

క్క యుద్యమములు కొనసాగుట కవకాశమంతగా కలుగుటలేదు మనలో జమీందారులను పోవిడిచిసంసారులను జూచినన్నను నాంగ్లేయవిద్యాభ్యాసము చేసిన వారిలోన నేకులు తమవిద్యనెటులవినియోగపఱచుచున్నారో యిది వరకేచెప్పియున్నాము. వీరిలోనైకమత్యము బొత్తిగాత క్కువగ నుండుటచే చేయుటకు పూనుకొన్న మహత్కార్యము నెకరిద్దఱుపూనికతో చేయుచుండ తాము వారికితోడ్పడకున్నసరియే గదా, చూచియానందింపనైన లేక వారి యుద్యమములు కొనసాగకుండునటుల ధైర్యసాహసములతో ధారాళముగ గుణదోషములెంచ సాహసము లేకమనవిలో చాడీలుచెప్పుచు పాసకమునపుడకలువేయుచుందురు దైవానుగ్రహముచేనిట్టివారిసంఖ్య కాలక్రమమున తగ్గిపోవుచున్నది. పూర్వకాలమువలె నధికధనముతో చేయవలసిన కార్యములకొఱకు తులాభారము తూగు వారి నాశ్రయింపవలసిన...సిలేదు. గడ్డిపఱకలువెంటిగాజేరినపుడేనుగను బంధింపజాలును. స్వల్పస్వల్పమొత్తములను పోగుచేసి మనదేశమునకిట్టియుపయోగకార్యముల నైనను చేయుట కవకాశమున్నది గాని యాప్రకారము సంఘీభవించి ధనమునుపోగుచేసి సంఘముల నేర్పరచు జ్ఞానము జనసామాన్యమునకు గలుగవలెను అట్టిజ్ఞానోదయమునకు రెండుమార్గములుగలవు మొదటిది కంపెనీల నుస్థాపించి పనిచేసి యాకంపెనీలయందు తయారుచేయబ

కువస్తువులవలనఁ గలుగు నధికతరోపయోగమును నట్టికం పెనీలకు గలుగు ధనలాభమును ప్రజలకు కనపఱచుట.

అట్టి యంత్రశాలలుండుటవలన యన్యదేశములనుభవిం చుచున్న శుభైశ్వర్యాభివృద్ధులను బాగుగ గ్రహించి గ్రంధరూపమునగాని యుపన్యాసమూలమునగాని మనవా రికినచ్చచెప్పుట రెండవది. ధనవంతులకిట్టిజ్ఞానమును జ్ఞాన ముగలవారికి ధనమును లేకున్న మొదల నిందు మొదటిదికొ నసాగదు. మాపిల్లవానికివివాహమువలన వెఱ్ఱికుదురునని వైద్యుఁడుచెప్పుచుండ వానికిపిచ్చి కుదిరినవెనుక మాపిల్లని చ్చెదమని పిల్లతల్లిదండ్రులు చెప్పుచుండ నీరెండునుజఱు గుటయెన్నటికినిసంభవించదు. కాబట్టిధనవంతుల మాఢ్య మును నివారించువఱకువిద్వాంసులు ప్రయత్నముచేయుచు నేయుండుటవిధి. కావున రెండవది సాగించుటకవకాశము గలదు. గ్రంధములనచ్చొత్తించుటకు మూలధనములేకుం డిన నట్టిగ్రంధములువ్రాయుటమూలబడును కానిరాత్రిం దివములు విరామములేకుండ మనదేశమిప్పుడనుభవించు చున్నదారిద్ర్యదురవస్థలను వానినివారణకై మనవారిబు ద్ధిశక్తిధనములనువినియోగపఱుపవలసిన మార్గము లను వేసారకబోధించుచుండుటకు భగవద్దత్తములయినబు ద్ధియును వాక్కును కలిగియుండినచాలునుగనుక నిజమైన దేశాభిమానముగల విద్వాంసులకీవిధముగా లోకోపకా

తమును చేయుట కేయడ్డంకియును లేదు. ప్రథమమున పని
లేనిమంగలి పిల్లితల గొఱుగుచున్నాడని దూరదృష్టి లేనివా
రు పరిహాసింపుచుందురుగాని భూమియొక్క మంచి చెడ్డల
నెంచక విచ్చలవిడిగా విత్తులు వెదచల్లిన సందొకచోట నై
నను నారంటక మానదు. పరబీజములైనను మొలకలెత్తి
పెరిగి ఫలించక మానవు. అట్లొకఁడు లక్షలకొలఁది ప్రజ
లకు జ్ఞానోపదేశము చేయుచుండ పదిమందికైనను వాని
యోగ్యతను కనిపెట్టి వానివలన ప్రదర్శింపబడు మార్గము
నందు నడువక మానరు. ఇట్లు నానాట జ్ఞానాభివృద్ధి కలిగి
సద్వృత్తులు మనవారవలంభించుట కేసందియమును లే
దు. కాని యొక కంపెనీస్థాపింపఁదలంచి యేపెద్దవారినో
యాశ్రయించి యుంగరపుచేతులతో వారిని మొట్టించి
గాని లేనిపోని యబద్ధములు చెప్పి ప్రజలను మోసపుచ్చి
గాని కొంతసొమ్ము చేర్చుట సంభవించినట్టిదితుదముట్ట నేర
దు. కార్యానుకూల్యమునకిది సాధనము గాదు. సత్యము నే
ప్రధానముగా జేసికొని లోకోపకారబుద్ధితో పనిచేసినయు
ద్యమము కొనసాగును. తానును బాగుపడును. అంతియేగాని బ
లాత్కారముగనో మోసపుచ్చియో కట్టడలఁచుకొన్న కొం
పచీట్లపేకతో కట్టినబొమ్మరిల్లువలె రవ్వగాలికే పడిపోవును.
"కసుఁగాయబండకుండఁ గాయఁగోయుచుచవి చేటుగాదు విత్తు
చేటుగలుగు పక్వమగుదుఁగోయ ఫలమిచ్చు చెడదు బీజం
బు కార్య సిద్ధిచందమిట్లు" అనిన భాస్కర నీతిని మనము

నందు నెలకొలిపి పనిచేయుచుండిన క్రమక్రమముగా ప్రజలుకన్నులు దెరతురనుటకుసందియములేదు. కలకత్తా బొంబాయి మదరాసుమున్నగు పట్టణములయందు స్థాపించబడిన యంత్రశాలలను జూచుటవలన కొందఱికిని కాంగ్రెసులకు, కాన్ఫరెన్సులకు, యెగ్జిబిషనులకుపోయి, లోకోపకార ధురీణులుపన్యసించు నంశములవలనను కన్నులతో జూచు వస్తువులవలనను మరికొందరికిని దేశాభిమానముపుట్టి వారివలన తాముపొందిన లాభమును తమతమయిండ్లకు తిరిగివచ్చినవెనుక కొందఱుకొందఱు తమచుట్టుప్రక్కల పట్టణములయందును పల్లెలయందును ప్రజలమాధ్యముతొలగుటకు జ్ఞానసాధనములను నుపన్యాసాదులమూలమునను యంత్రశాలాదుల స్థాపనలమూలముననుచేయుచున్నారు. ఇట్టివారుమనదేశమున చేయవలసినపనులనేకములున్నయవి. ఒక్కడేదారినిపోయిన తక్కినవారందఱును వానిమడమలుత్రొక్కుకొనుచు నాదారినేపోయి వానినిచెఱచి తాముచెడునట్టిదశ ప్రతిదేశమునకును ప్రారంభమునను కలుగుచునేయుండును. మనవారిలోనొక్కరుబియ్యపుమరపెట్టిన గోదావరీ కృష్ణామండలములనెన్నిబియ్యపుమరలెన్నివిధముల వెలసినవియోచూడుడు. ధాన్యముపండు డెల్టాలుగలమండలములగుటచేతను ధాన్యమునకెప్పుడును నవసరమును ధరయును నుండుటచేతనవియు

న్నియు నేచికిత్సను లేకసాగుచునేయున్నయవి అందరిధనమునెల్లర శక్తియుక్తుల నెక్కుపనియందే వినియోగింపక పలువిధములగు పనులయందు వ్యయపెట్టుటకవకాశమెంతమోగలదు. అట్టివానిలో కొన్నిటిని నీక్రింద వివరించుచున్నాము.

ఇట్టివన్నియును ధనముసంపాదించి దానిపెంచుటకేగదా, ఇంపులకై పడరానిపాట్లుపడి కన్నవారికెల్ల మనకుమంచికని శోచినదానినిగూర్చి చెప్పియొప్పింప కంఠశోషపడనేల? ఇంతకష్టపడకుండ ధనముసంపాదించుటకు వీళ్ళులేవాయని మనలోకొందఱనెదరుగాని ధనమేపావనమనుకొన్నయెడల యోగర్హ్యావృత్తిచేతనైనను ధనముసంపాదింపవచ్చును. రేగుకాయకుమసిబూసి నేరెడుకాయయనిలోకమునుమోసబుచ్చి సొమ్మసంపాదింపవచ్చును. తాటిబెల్లమునానవేసిన యటుగులు నెక్కొకపాలును రెండుపాళ్ళులవంగాలు దాచినిచెక్క మిరియాలు కలిపి నూరి పిసరగింజలంతమాత్రలుగట్టి అజీర్ణతిమిరార్కమనుపేరుపెట్టి నూరుమాత్రలుగలడబ్బియొకటి రెండురూపాయలకమ్ముట పారంభించిన కొనువారుదొరుకకమానరు. తటాకమృత్తికేశ్వారము లంకిణీతైలము జ్వరగజాంకుశము అనుపేర్లతో వార్తాపత్రికలయందు మందులజాబితాయొకటి ప్రచురముచేయువారందఱును ధన్వంతరియంతటివారని లోకము

నమ్మియట్టిమందులను కొనుచుండుటచేత వారికి దినదినక జీవనోపాధియగుచుండుట లేదా?

మంచినీళ్లలో హారంతికచ్చాగపుబిళ్ళలను నానవేసి ఆ వాసననీటికిపట్టిన వెనుక నీటినిసీసాలలో నింపి బిరడాలు బిగించి దానికి సంతానసంజీవనియని పేరిడిన వేలకొలది ప్రజలు వెఱ్ఱినమ్మకముచే 2, 3 రూపాయిల వెలకైనను కొని సేవించుచుండ ప్రకృతిధర్మము ననుసరించి గర్భిణులైనవారి మందుమాహాత్మ్యమేయనినమ్మి యితరులనామందుకొనుటకై ప్రోత్సాహపఱచుచుందురు. కానియిట్టినృత్తులు గౌరవేతరములును ధర్మాపేతములునుగాన దేశాభివృద్ధి కోరు యోగ్యు లెవ్వరిట్టిమార్గముల ధనసంపాదన మాత్రమునని తలంచరు. ఇట్టి కుయుక్తులవలననిజముగ మంచిమందుల నమ్మువారిపరపతికూడ చెడును. పైనచెప్పబడినరీతిని తాము ధన సంపాదనమునకై చేయుప్రయత్నము దేశాభివృద్ధికి గూడ సాధనముగా నుండ వలయును. అందులకై మన బుద్ధిని కొంచెము మంచి దానికి ద్రిప్పి శ్రమ చేసి యనుభవ జ్ఞానమును సంపాదింప వలయును ఆ యనుభవజ్ఞానముగలవాడు తుంటరిపనులవైపు మనమును పోనియ్యడు. పొగుగువానిపొలమునకు పోవునీటిబోదె నరికట్టి అందలినీరు ముప్కరముగా తనపొలమునకు బెట్టువానినిజూచినను దొంగదస్తావేజులను సృష్టించియో కూ

టసాక్ష్యములను బలపఱచియో, యేపాపము నెఱుగనివారి పై వ్యాజ్యములు పన్నువారిని జూచినను, వడ్డీలకువడ్డీలు కట్టి తప్పులెక్కలు వ్రాసి ఋణములు పెంచి యేసత్య కాలపురోహితునో మోసపుచ్చి వానిగొడ్డుగోసలన్మ్రింగి వానికిస్థలభాండశుద్ధిచేయువారిని జూచినను, అట్టిజ్ఞానము గలవాఁడు సహింపజాలఁడు. వారినడవడికవలన వారికిని దేశమునకును గలుగునష్టములను వారికిబాగుగదెల్పి విధి కృత్యములను వారికిబోధచేయుటకై యత్నించుచుండు ను. అట్లునానాట యోగ్యులసంఖ్య మనదేశమునందభివృ ద్ధియగుచున్నది. ఆహేతువుచేతనే యీగ్రంథమూలమున మేమిట్టి హితబోధచేయఁబూనుకొనుటకవకాశమునవసర మునుకలిగినది. మనముచేయఁబూనిన దేశాభివృద్ధికి వల యుపనులనేకములున్నవి. వానినన్నిటిని యిచ్చటవ్రా యుటకవకాశము లేదు. కానికొన్నిటినిమాత్రము మార్గ దర్శకములుగా నుండుటకు తెలియజేయుచున్నారము.

ఏలూరునకు 7, 8, మైళ్ళదూరముననున్న రాతిగనుల యందు తయారుచేయఁబడురాళ్ళను మోటబండ్లపయి న తిప్రయాసముతో ధనవ్యయమునకును కాలయాపనమున కును లోనై తెచ్చుచు దారినిపశువులును బండ్లవాండ్రును పడుకష్టములను నివారింపదలచుకొన్నయెడల స్వల్పస్వల్ప మొత్తములుగలభాగములతో నొకకంపెనీస్థాపించి యా

తాతిగనులనుండి రైల్వేస్టేషనువరకో, కాలువవరకో "ట్రా
మువే" యను ఇనుపదారినివేసి ఆయెడ్లవలననే బండ్లనులాగిం
చినయెడల నాకంపెనీకి యెంతో లాభమువచ్చును. కొనుకా
తికిని గాయిచౌకగాగిట్టును. ఈవిధముగా నేమరియొకకంపెని
యేభద్రాచలమునకు సమీపముననో ఉకు మాన్యుఫాక్
మాత్రికులనుపలకపునుకోయు యంత్రశాలను నిర్మింపవచ్చు
ను. కోసినత రూంగుచేసినకలపను యెగుమతి దిగుమతులు చే
యుటయంతవలెగాక యులవిగాసిమూాగ మొద్దుల నెగుమతి
దిగుమతులు చేయుటలో వ్యయప్రయాసతక్కువయగును
వేలకొలదిపుట్లధాన్యమును తయారుచేయుటకు కోతలకు
ను నూర్పుడులకును నగుచున్న ధనవ్యయమును పశునష్ట
మును మాన్పుటకై కోతయంత్రములను నూర్పిడియం
త్రములను సంపాదించి వానితో రయితులకు స్వల్పమూ
ల్యమునకు నూర్పిడచేసిన రయితులును తామును లాభ
మునుపొందవచ్చును. ఇట్టివ్యవసాయ యంత్రములయను
భవము మనరయితులకు లేకుండుటచే ప్రాచీనసాధనము
లతోడనే పాట్లుపడుచున్నారు. స్వల్పకాలములోనే మా
ర్షల్స్‌సన్సు అండు కంపెనీవారు వ్యవసాయయంత్రములను
చుట్టుప్రక్కలవారికందరికిని తెలిపి వానినుపయోగించు
విధము రైతులకునేర్పి తాములాభమునుపొందుటకై తమ
కంపెనీయొక్క యుపశాఖనొకదానిని బెజవాడలో నిర్మింప

బోవుచున్నారని వినుటకెంతయు సంతసించుచున్నారము. గానుగుల పేటలో గానుగకొక యెద్దునుగట్టి దానికన్ను లకుగంతలుకట్టి కాడికిని గానుగకునంటియున్న పలకపైని పెద్దరాతిని పెట్టి ఆరాతిప్రక్కను కునుకుచు కుఱ్ఱవాడొకడు గూర్చుండియోలుచుండ నుదయము మొదలు సాయంత్రమువరకు క్రమముగానుగనాడియాడి తీయు తైలము కంటె తేలీలందరును నొకసంఘముగాచేరి స్వల్ప మొత్తముతో మూలధనములపోగుచేసి తైల యంత్రములను స్థాపించిపని చేయుచుండిన నధిక లాభమునుసంపాదించి తమ గ్రామమునకువలయు తైలమమ్ముటయేగాక పై దేశములకెగుమతి చేయునంతగూడ తయారుచేయుట కవకాశము గలదు.

పికల్లు పీకుకొనిపోవులాగున ములుగులువిఱుగులాగున గోతనుండినూతివరకు యెద్దులనువెనుకకెక్కించి మెడలు నాగిపోవునటుల మాఱులగోతిలోనికి గొట్టుచుండ తడవతడవకును నీటిని తెచ్చిపోయుగూడలచేతను ముందు వెనుకలకు త్రొక్కులిడుచు దినమెల్లను తోడు కాసెముల చేతను జబ్బలు పడిపోవునటుల నిద్దరుమనుష్యులు తోడి యెగబోయుగూడబుట్టలచేతను పొలములనుతడుపునీటికన్న శుభ్రమగు జలయంత్రమును పెట్టి పని చేసినయెడల కష్టమును ఆయాసమును తగ్గుటయేగాక యవిచ్ఛిన్నమగు జలసమృద్ధి

యును లాభమును హెచ్చును అనేక గ్రామములు రైలు స్టేషనులకును, నదులకును, కాలువలకును, అతిదూరము గనుండి వానిని చేరుటకు సరియైనదారులు లేక నాయాగ్రామములలో పండినపంట నితరచోటులకెగుమతి చేయుటకు నితరస్థలములనుండి యవసరమైనపదార్థములను తెచ్చుకొనుటకును వీలులేక పలువిధములైన కష్టములపాలగుచున్నారు అట్టిగ్రామముల యందెట్టి సామాన్యమైన కయినను రోగము సంప్రాప్తమై బాధపడుచుండునపుడు 10, 12 మయిళ్ళదూరముననున్న ఆసుపత్రినుండి డాక్టరును పిలుపించుకొనవలెనన్న వీలులేదుగదా! ఒకవేళ వైద్యుని తెచ్చుటకవకాశముండినను పండ్రెండుగుర్రపుబండ్లకూలీవారిమీద వెళ్ళవలయును గాని మరియొకవిధము వీలులేదు. అట్టిగ్రామస్తులు కొందరు జాయింటు స్టాకు కంపెనీగా జేరి ప్రభుత్వము వారి సెలవునుబొంది తమగ్రామములను సమీపమందున్న పెద్దపట్టణములతో మంచిరోడ్లను వేసికలిపి ఆరోడ్డుననడచు వాహనములకును జంతువులకును బండ్లకును పన్నులు పుచ్చుకొనుచుండినయెడల ప్రభుత్వము వారికిలాభముచేసి ప్రజలకు సదుపాయమెక్కువగా చేయుటయేగాక తమకు లాభమునుకుప్పతిప్పలుగా సంపాదించవచ్చును. మరియొకకంపెనీయేర్పడి సమీపపట్టణములతో తమగ్రామములను టెల్లిగ్రాపుమూలమునగాని టెల్లిఫోనుమూలమునగా

నికలిపిలాభముసంపాదించుటకువీలుగలదు. ఆవిధముగాగో డ్లును నార్తాంప్టనులోను వెలసిన వెనుకయుపాధిగల వాడుగం డ్రీవార్తను పంపించినంతమాత్రమున సకాలములో వైద్యుడు 10,20, మైళ్ళదూరమునుండియైనను బైసికిలుమీదవచ్చి పోవుటకవకాశముగలదు.

ఇట్టివిదేశకాలపాత్రములనెఱింగి యెక్కడయేయంత్రశాలల యవసరముండునో యక్కడ వానిని స్థాపించుచుండిన దేశమునకుసమవాయమును యంత్రశాలకు లాభమును కలుగక మానదు.

నార పైరగుచోట నారనుతీయుయంత్రములును, ధాన్యములు విరివిగా పండుచోట బియ్యపుమరలును, వెనుక, జమ్ము మొదలగునవి సులువుగాదొరకుచోట కాగితపుయంత్రములు నేర్పఱుపవలెనుగాని హిమవన్నగరప్రాంతముల దొరకు వస్తువులతో తయారుచేయుయంత్రములను సేతువు రొద్దను గంగయొడ్డున లాభకారియగుయంత్రశాలను గౌతమీతీరమున స్థాపించుటమంచిపనిగాదు.

గాజుపోతపోయుటకనువగుచోట్ల గాజుయంత్రములును, లోహోత్పత్తిస్థానములకు సమీపమున లోహములను, కరిగించి పనిచేయుయంత్రములను స్థాపించవలయును.

ఇదియంతయు నిట్లుండ కొన్నికంపెనీలేర్పడి ధనము సంపాదించి తాముతీయులాభముగా నూటికెంత మొత్త

మని యేర్పాటుచేసి దృఢగాత్రులును బుద్ధికుశలతగల వారును యోగ్యులు నగు బాలురను ఐరోపా అమెరికాఖండములకుగాని జపానుదేశమునకుగాని పంపి వృత్తులను నేర్పెడు శాస్త్రిపాఠశాలలయందు, చదివించి యింజనీయరులను చేసి మనదేశమునకు తెప్పించుచుండవలయును.

„సీవాయేజిఫండను పేర" మద్రాసుప్రెసిడెన్సీయందలి దేశాభిమానులగు పెద్దలుకొందఱు "సాగరయాననిధి" నేర్పఱచి ధనము విశేషముగా పోగుచేయుటకు ప్రయత్నము చేయుచున్నారు. ఈవిధముగా యంత్రశాలలు దేశమంతటను నెలకొల్పబడి, యా యంత్రములను చేయుటకును, వానిని యంత్రశాలలయందు నడిపించుటకును స్వదేశీయులే సమర్థులైనయెడల, యన్యదేశపు యంత్రములను కొనుటయందును అన్యదేశీయులను వానిని నడిపించుట కేర్పఱచుటయందును వెచ్చించవలసిన ధనము మనకు కూడిక యగును. ఈవిధమున దేశమునకుగూడ నైశ్వర్యాభివృద్ధి కలుగును. కాలానుగుణ్యముగ బుద్ధులు మారుచుండుటయు కార్యములుకొనసాగుచుండుటయు సంభవమగును ఇప్పుడు మనదేశమునకిట్టి విద్యయు నీయంత్రశాలలును అత్యావశ్యకములుగనుకనే ప్రజలును ప్రభువులును గూడనిటువైపు దృష్టిత్రిప్పినారు. వవర్నమెంటువార

న్యదేశములకుపోయి యంత్రసాధనాది శాస్త్రములను నే ర్చుకొనువారికి రాకపోకలఖర్చులును, పాఠశాలజీతములును గాకసాలునకురు2250లు విద్యార్థివేతనము (Scholarship) హిందూదేశపు విద్యార్థులకిచ్చుటకు (State Technical Scholarships) స్టేటు టెక్నికల్ స్కాలరుషిప్పుల నే ర్పఱచినారు. ఇట్టిభరతఖండమునకు శుభములు సమకూను చుండ తీర్థపురేవు నాశ్రయించు కాలువలనక్రమముగా నె త్తమోద్యమములకు విఘాతకలుగ జేయునట్టి యాక్షేపక లు పొడసూపుచుండుట లోకానుభవము కలవారందఱు నెఱిగినదియే.

యంత్రశాలాభివృద్ధివలన దేశమునకువిపత్తుకలుగును గ నుక యూవైపులకునతివినరుగానడకసాగింపకూడదనువారు కొందఱుబయలుదేరినారు. వారియాక్షేపణలలోముఖ్యమై నహేతువిక్కడ వివరించుచున్నాము. ముక్కాలుమువ్వీస మువునదేశీయులుకృషివలన జీవించుచున్నారుగదా! యం త్రశాల లెక్కువమైనకొలదినివ్యవసాయమునందిదివరకుపా టుపడుచుండిన జనమంతయును యంత్రశాలలయందు పను లకు కుదిరిన దేశమందలి వ్యవసాయముచెడగంటునని వారి తాత్పర్యము ఇదిసరియైనయాక్షేపణముగాదు. పయిచూ పునకిది యొకహేతువుగా గన్పడును గాని సూక్ష్మముగ యోజించినపక్షమున యంత్రశాలాభివృద్ధి దేశమంతటివ్యవ

వసాయమును వెంపుచెందించునని స్పష్టముకాగలదు. అన్యదేశములు యంత్రశాలలను స్థాపించి సమస్తవస్తువులను నతిస్వల్పకాలములో తయారుచేసి మనదేశమునకు పంపుచుండుటవలన స్వదేశమందు తయారగువస్తువులు వెలలో నన్యదేశపదార్థములతో తాళజాలక యధిక వెలలకు కొనవలసివచ్చుటచే తక్కువవెలకు దొరకు నన్యదేశపుసరకులనే మనముకొనుచుండుటవలన స్వదేశపు పనులనుగంటి యన్యదేశీయులు లాభమునందుటచూచి యీలాభమన్యులకుపోకుండ మనకేనిలుచుటకుగదా మనదేశమందు యంత్రశాలా స్థాపనమునకు నభివృద్ధికిని అవసరముకలిగినది. ఒక్కపల్లపుపంటవిషయమై యోచించిచూతము. అదియే అన్నివిధములగు వ్యవసాయమునకు వర్తించును. బియ్యపు మరలు స్థాపింపబడినతోడనే చేతి ద్రోక్కుతోదంపునప్పటికంటె నెక్కువ ధాన్యమొక్కొక్క మరకు కావలసి వచ్చును. ఆయెక్కువ ధాన్యముకొఱకు నెక్కువ పంటపండింపవలయును. వ్యవసాయపు పనులయందు తిరుగు పాటకపు జనములో నెక్కువ మంది యంత్రశాలలయందు పనులకు కుదురుటచే మనరయితులు మఱలకు కావలసిన ధాన్యమును పండింపజాలకుందురుగాని యంతమాత్రముచేత ధాన్యపుమాఱి పడుకొనదుగదా. అన్యదేశములయందలి యంత్రములకు కావలసిన

దూది, నార, ధాన్యము, మొదలగునవి ఆయాదేశముల లో దొరకకుండుటచే ఆయా యంత్రశాలలను కట్టిపెట్టి క యన్యదేశములనుండి సరకులనుదెచ్చి యేవిధముగా యంత్రములను సాగించుచున్నారో యారీతిగానే, యే దేశమున యంత్రసాధనములచే వ్యవసాయముసాగించి పశువులయొక్కయు, మనుజులయొక్కయు నవసరమంతగా నక్కరలేకుండ కృషినడపుచున్నారో ఆయా దేశములనుండి ధాన్యము తెప్పించి యంత్రశాలలనడిపింపకమానరు. పైనచెప్పఁబడిన హేతువునుబట్టియే యట్టిలాభమును మన దేశముకూడ పొందదలచి వ్యవసాయముకూడ యంత్రసాధనముననే చేయుటకు మొదలుపెట్టుటకు కంపెనీలేరుపడును. కావున యంత్రశాలాభివృద్ధి వ్యవసాయమును వృద్ధిచేయునదేగాని తగ్గించునది యెన్నటికిని కాదు.

ఇట్టియాక్షేపణము లింకను నెన్నెన్నియో గల్పించి విపరీతబుద్ధులు చేయునిరుత్సాహమునకు లోనుగాక యెల్లవారును యంత్రశాలాభివృద్ధికై పాటుపడుచుండి పోటీలకుదిగి పాడుగాక యైకమత్యముతో పనిచేయుచుండుట సర్వవిధముల శ్రేయోదాయకము.

———

# అయః ప్రభావము.



## 5 వ ప్రకరణము.



యంత్రశాలలు స్థాపించి పెంపు జెందించునంతవరకు దేశమున కైశ్వర్యాభివృద్ధి కలుగ నేరదని యిదివరకు చెప్పియుంటిమి ఆయంత్రశాలలసంఖ్య పెఱిగి వానియందు తయారు చేయఁబడు వస్తువులు కుప్పతిప్పలుగా నిలవచేయఁబడి యుండినయెడల లాభమేమియును లేదు. ఆవస్తువులను గొనువారుండవలయును. వారుస్వదేశీయులుగాక యన్యదేశ నివాసులైనయెడల లాభమంతగా లేదు. ఇదియటుండ శిష్టార్థపుబన్ను లన్యదేశీయులు విధించి మనవర్తకమునకు నష్టము తేగలరని యిదివరకు చెప్పియున్నాము. ఆసేతుహిమాచలము మనమేవర్తకవ్యాపారము జరుపుకొనిన నిప్పటియవస్థనుబట్టి మనయంత్రశాలలకు పనిజాలును. కావున హిందూదేశవాసుల కెవ్వియవసరములో వానిని చేయుయంత్రములు స్థాపించుటయే

ప్రధానకార్యము. పూర్వకాలమందు చేతి పనివాండ్ర చేతనే యున్నివస్తువులుతయారు చేయఁబడుచుండెననిమరల వక్కాణించనక్కరలేదు. పట్టణములందును పల్లెలయందును నివసించు జనసామాన్యముయొక్క సుఖజీవనమునకు పూర్వకాలమందెన్నో వస్తువులవసరము లేకుండెడివి యని చెప్పితిమిగదా! అట్లుండియుయాదినములలో నమూల్యపదార్థములు చేయబడక పోలేదు. కర్రమీఁదను లోహములమీఁదను చేయబడుచుండెడు నగిషీపనులును, వింతవింత అగు రత్నకంబళములును, వానిరంగులును, నమూల్యములు శాలువులును, డక్కాపట్టణమునందలి పట్టుసాలీలచేనేయబడు నాణెములగు శల్లాలును, రాతిచెక్కడములును, పది యిరువది శతాబ్దములకు పూర్వమే మనదేశమందు కొనఁబడు చుండుటయే గాక రోముదేశము మున్నగు దూర దేశపు బజారులందు గూడ మిక్కిలి గౌరవముతో నాదరింపఁబడుచుండెను. జీవనమునకు గావలసినవానిని తయారుచేయుట కవసరమగుప్రతివస్తువయును మనదేశమునందే దొరకును. సర్వవిధములగు యంత్రశాలలను దేశమంతటను వెదజల్లబడి యుండినయెడల నొక్కపూరిపుడకయైనను నన్యదేశములనుండి తెచ్చుకొనవలసిన యవసరములేకనే సమస్తమును మనయంత్రముతే సృష్టింపగలవు. వానిని మనమనుభవించి య

న్యదేశముల యావసరములుఁగూడ గనుపఁగలవు. మనదే
శముయొక్క పూర్వావస్థ మిక్కిలి మారెను మనయవసర
ములంగొంత కఠినములగుచున్నవి. ఆయవసరములను దీ
ర్చుటకై ముద్దిమనుముకారుగా వస్తువులు వెలసినవి. ఇం
కనవేఁములు బయలుదేరుచున్నయవి. ఈస్టిండియాకంపె
నీవారు హిందూదేశముతో వర్తకము జేయు స్వాతంత్ర్య
మును పుచ్చుకొను కాలమందుండిన, యింగ్లండు యొక్క
యు మనదేశముయొక్కయు నవస్థలకు నిప్పటియవస్థల
కును మిక్కిలి వ్యత్యాసముగలదు. ఆనాఁడు యంత్రశాలాభి
వృద్ధి యాంగ్లేయరాజ్యమునందే లేకుండుటవలనను, అప్ప
టి మనవారికవసరమైన వస్తువులన్నియు నక్కడినుండి ది
గుమతియైన వానికంటెనిక్కడనే చౌకగదొరకుచుండుట
చేతను, అకంపెనీవారికి లాభమంతగా నుండనేరదని ప్రా
రంభమునందు దూరదృష్టిగలరాజకీయోద్యోగులనుమానిం
చిరి కాని స్వల్పకాలములోనే యంత్రశాలాకల్పిత పదా
ర్థములు పొడసూపి మనదేశపుబాజారు లన్నియు నాపదా
ర్థములతోడ నిండి మనవస్తువులను వెనుకకుగెంటివేసినవి.
మనయాముదపుకన్న కిరసనాయిలు చౌకగాదొరకుచుం
డుటచే మూర్ఖులును చేదస్తులును దీనిముట్టుచున్నారుగాని
యీకిరోసనాయిలు ప్రతిగ్రామమునందలి చుట్టుగుడిసెలో
నుజొరబడినది దీనివాడుక యెప్పుడేర్పడినదో మట్టిప్రమిదెల

ప్పటినుండి మూలఁబడినవి దీపావళి దీపావళికిని, యీకు ష్మారస్వరూపముల దలంతులుగాని ముప్పాతిక ముప్వీసము ప్రజలుదీనిపేరే మఱచిపోయిరి. ఎక్కడజూచిన లోహపు బుడ్లును, గాజుకుప్పెలును, అవసరములైనవి. ఎంతచిన్నపట్టణమైన నిట్టివాని నమ్ముకొట్టములేనిదిలేదు. వీనివత్తులకు గుడ్డపేలికలును దూదియేకులును పనికిరాక నేసినబద్దెలు. కావలసివచ్చినవి. ఈబద్దెదారక్క గొప్పవర్తకమైనది. పైకిమెట్టువేదాంతములెన్ని చెప్పచుండినను యినామెల్ పాత్రలు పళ్ళెములు మొదలగునవి పల్లెటూరి వైదికగృహములను గూడ పవిత్రముచేయుచున్నవి. కాలుమడతవేసితాటాకుపై విస్తరిగంటములతో వ్రాయు దారసత్వతప్పిపోయి, కాగితములును కలములును విరివిగానుపయోగించబడుచున్నవి. ఆకాగితములలో గూడ పీచుకాగితములును కలపకఱ్ఱములునుపోయి వింతవింత రంగులుగల పలువిధములైనకాగితములు, పాళీలు దేశమందంతట నుపయోగించబడుచున్నవి బాతు, నెమలి, యీకెల కలములనుపయోగించు వారుగూడ క్రమముగా తగ్గిపోవు చున్నారు. ఎక్కడజూచినను వెల్లికొల్లారముగపాళీలవర్తకము ప్రబలినది. కొలికిబుడితిసీలును, బొందులయంగీలును మారిపోయి గుండీలయవసరము ప్రబలినది. పాదరక్షలలోగూడ నీరీతినే మార్పులుగలిగినవి. ఈవిధమున నశ్వాదిజంతువుల

కుపయోగించు పళ్లెములును కళ్ళెములును మూలబడిపోయినవి. సవారీలు మూలబడి గుఱ్ఱపుబండ్లును సైకిలులును తరుచుగా నుపయోగించబడుచున్నవి. ఇంటింటను పటములును, అద్దములును గోడలనలంకరించుచున్నయవి. చాపలకును, జముఖానాలకును బదులుకు మారుగా సోఫాలును కురిచీలు నుపయోగించుచున్నారు. పొగతోడను వాసనతోడను బాధించుచుండెడు ముఱికి పాతపీలికెలతో చేయబడిన కాగడాలయవసరము తప్పి లాంతరులు వాడబడుచున్నవి. ఇటుల చెప్పబూనుకొనిన నీజాబితా కంతముండదు. వైద్యుల! ఏపాతవస్తువులను గింటి కొట్టికొని క్రొత్తపదార్థములు బయలుదేరినను నందులకవసరమైన ప్రత్తి, గోగు, జనుము, మొదలగునారలు మనదేశమందు పండింపబడుచున్నవి. ఉన్నియునిక్కడ నేదొరకును. సమస్తలోహముల నిచ్చుగనులును, నిచ్చటనేయున్నయవి. పలువిధములైన వృక్షములతో మహారణ్యములు మూల్గుచున్నయవి ఎన్నన్ని యోపనులకుపయోగించుటకు చర్మములు, కొమ్ములు, గొరిజెలు, ఎముకలు నీదేశమున సమృద్ధిగాగలవు. అవసరములగు ఫలములు, పుష్పములు, ఆకులు, చెక్కలు, మూలికలు, జిగురులు, మన యడవులయందే యున్నయవి. ఇట్టి వస్తుసమృద్ధియు, వృద్ధియు భగవదనుగ్రహముచే మనకుం గలిగియున్నను పలుకారణములచే జ్ఞానాభివృద్ధికి భంగము

కలిగించునట్టి యాచారములకును నవస్థలకును, దాసులమైయుండి నేత్రములుండియు జాత్యంధులవలెను, పాదములుండియు పంగులవలెను, మెదడుండియు పుట్టిబొమ్మలవలె నుండియుండుటచే నిన్నమొన్నటివరకు నవసరములగు పదార్థములన్నియు నన్యదేశములలో చేయబడినవానినే సేకరించుచుండిన నిప్పుడిప్పుడు కాలయోగముచే పిండిబొమ్మకు ప్రాణప్రతిష్ఠచేయబడినట్లు మనకు జ్ఞానోదయమైయుట్టి యఖండసంపద్భరితమైన భరతఖండమందు జన్మించి తల్లిచావు పిల్లలవలె యన్యదేశపు యంత్రశాలలచే పోషింపబడుటకును భరింపబడుటకును సిగ్గుపడి బొగ్గుకలుచుకొను కాలమువచ్చినది. కొద్ది సంవత్సరములకు ముందు మనదేశపువస్తువెంతమంచిది దొరకుచున్నను పైసీమనుండి తెప్పించుటయే మెప్పు-నగానెంచబడెడు బుద్ధిమారిపోయి స్వదేశపదార్థములను బాగుచేసికొని వానినే యుపయోగించుట పురుషకారమను జ్ఞానమిప్పుడుదయించినది 1901 సంవత్సరమున కలకత్తాలో జరిగిన ఎక్సిబిషను దినములలో స్ఫుటమగు నక్షరములతో పెద్ద కాగితములపై దట్టమగురంగులతో వ్రాయబడిన "Remember thy country in all thy purchases" నీబేరములయందెల్ల స్వదేశమును జ్ఞప్తియందుంచుకొను మనుహెచ్చరికను వీధివీధినియుంటించబడిన సంగతి యచ్చటికేగినవారి కెల్లరకును విశద

మేగదా! సుఖజీవనావసరమునకు మించిన ధనమును కూడ బెట్టి దానివినియోగించు మార్గముల నెరుగక దాస్యపదిల పరుచుటకై తెవులు లేని వేదసబడువారికిగూడ దేశాభిమానముపుట్టుట కవకాశముగలదు. దేశాభిమానులసంఖ్య నానాట పెంపుజెందుచున్నది.

అందుచే మనయంత్రములవలన తయారు చేయబడువస్తువులు స్వదేశమందమ్ముడువ్వావనెడు చింతకవసరము లేదు. స్వదేశీయుల కవసరమగుపదార్థము లేగాక అన్యదేశీయులకువలయుపదార్థముగూడ నిక్కడనే చేసినను వానిని గొనువారును లేకున్నవారుగారు. ఐరోపాఖండమందు జన్మించిన వారనేకులు వారివయస్సంతయు మనభూమిమీద నేగడపువారున్నారు సమాన యోగ్యతగల పదార్థము లేదేశపువి చౌకగా దొరకిన వానినియేయుట్టివారుకొందురు. ఐరోపాఖండము వారి కవసరములైనన్ని వస్తువులిక్కడ యనావశ్యకములయినను యక్కడపడినయుల వాటులిక్కడతప్పవు. వారిలో ధనికులగువారు డబ్బీలలోను పొట్లములలోనుకట్టితేబడియెద్దేమమూడలుగమండిపోవు వెలకమ్మబడువస్తువులకొనియనుభవించుచుండపులినిజూచినక్క వాతబెట్టుకొనినట్లు వారికంటెతక్కువయుపాధులు గలవారును వారిదారినేయవలంబించి మార్వాడీలచేతులలోచిక్కి వికటకరించుచుండుటచే నట్టివస్తువు లిక్కడనే తక్కువవెలకు

దొరకునప్పుడట్టివారందఱును సీమవస్తువులను గొనకమానరు. వే షభాషలయందును, ఆచారవ్యవహారములయందును ఇంగ్లీషువారివలెనే యుండి మనలను మనయాచారవ్యవహారములను నిరసించుచు మనతో కలసిమెలసి యుండక తమ యుత్పత్తికి హేతుభూతులగు నాంగ్లేయులవలనను నిరసింపబడుచు నిటునటు భ్రష్టులై యున్న యూరేషియనులును దేశమంతటను వ్యాపించియున్నారు. ఒక్క మదరాసు రాజధానియందే సుమారు 40200 యూరోపియనులును యూరేషియనులును గలరు. వారివలెనే పింగాళీచిప్పలు మొదలగు వానిని గృహోపకరణములుగా నుపయోగించెడి మనరాజధానియందలి తురకలసంఖ్య సుమారు 2½ లక్ష. వారు నిట్టిసరకులను తప్పక కొందురు. ఇండియా గవర్నమెంటువారు యంత్రశాలాభివృద్ధికై సర్వవిధముల సహాకారులగుచుండుటచే తగినవస్తువులు దొరకినయెడల పబ్లికు ఆఫీసుల కవసరమగు నన్నివస్తువులను నిక్కడనే కొనుటకు సందియములేదు.

ఇవియటుండ డిస్ట్రిక్టుబోర్డులును లోకలుబోర్డులును వర్తకసంఘములును, గూడ మనదేశపు వర్తకులతోడనే ఖాతాలనేర్పఱచుకొందురు. ఇటులస్వదేశమందు కొనువారు కావలసినంతమంది యేర్పడినవెనుక కృషినియభివృద్ధి పఱచి యన్యదేశములకుగూడ నెగుమతిచేయుచుండ యన్యదే

శములతోఁగూడ ఖాతాలేర్పఱచును. ఇప్పుడేమనదేశపు వర్త కులిటుబర్మా సింగపూరు మలకా మొదలగు దేశములతోఁ డను అటుఆఫ్రికా మొదలగు ఖండములతోఁడను విరివిగా వర్తకము చేయుచున్నారు. నిరామిషమగునెమ్మికైఁ గాటు లాడుగాఁగ్రిమసింహములవలె వైరములు గల్పించుకొని చె డకుండ యంత్రశాలాస్థాపకులు సమాజమువేర్పఱచుకొని కట్టుబాటులను నిబంధనలనుచేసికొని యన్యోన్యాభి మా నముతో వర్తించుచు నీయన్యదేశములయందుండు మనవ ర్తకులనే తమకేజెంట్లనుగా నేర్పఱచుకొని తమసరకులను నాయేజెంట్లద్వారా, యన్యదేశములయందు విక్రయించి గూడ పెంపుజెందుట కవకాశముగలదు. ఇదివరకే మనస రకులెక్కువగ నన్యదేశముల కెగుమతి యగుచున్నవి. అ ట్లెగుమతియగు సరకులనుభవార్హములుగ తయారుచేయ బడినవిగాక పుట్టినవి పుట్టినట్లు యితరదేశములకు తయా రునిమిత్తమే పంపబడుటచేత నావర్తకమువలని లాభప్రా ప్తి మనకంతగా యగుటలేదు మనరేఖ బయలబడి తయా రయిన వస్తువులనేయన్యదేశముల కెగుమతిచేయు సదుపా యమునకు సూచనలు కనబడుచున్నవి.

1901 సంవత్సరము మొదలు కాంగ్రెసుమహాసభ కుప శాఖగా "ఇండస్ట్రియల్ ఎగ్జిబిషను" కృషివస్తుప్రదర్శ నము ప్రతిసంవత్సరము నిర్మింపబడుచుండుటయు, ఇండి

యార్న్ స్టోర్సు అనుపేరుతో కలకత్తా రాజధానియం దొక గొప్ప సంఘమేర్పడి వ్యాపారార్థములగు స్వదేశపదార్థముల నన్నిటిని బాగుచేసి దేశమందంతట నుపశాఖల నేర్పఱచి యతి శ్రద్ధతో పనిచేయుచుండుటయు, ముందు దేశమునకు గలుగబోవు నైశ్వర్యమునకు శుభశకునములుగానున్నవి. డెబ్బదిమూరల పాగాలు మూలఁబడి మాధిర, పల్లంపేట, యుప్పాడశాలువమాళ్ళు కొంతకాలమువరకాదరింపఁబడుచుండి యిప్పుడు టోపీలును, జీలుగ బెండు తలట్టెలును మనలోనెక్కువగా కొనఁబడుచున్నవి. పైనచెప్పబడిన యూరపియనులు, యూరేషియనులు మాత్రమేగాక, మనవారిలోననేకులు బంగాళాప్రసిడెన్సీ యందతివిస్తారముగను, తక్కిన ప్రెసిడెన్సీలయందు నుసకృతుగను దొరలు పెద్ద టోపీల నుపయోగించుచున్నారు. వానినితయారుచేయుటకవసరమయిన జీలుగబెండు మనదేశమున పయిరుచేయబడక నేకొల్లలుగా పెరుగుచున్నది. పెద్దపట్టణముల యందెల్ల నీపెద్దటోపీలును చిన్నటోపీలును జీలుగబెండుతలకుమాళ్ళు నమ్ముపట్టి దుకాణములతిత్వరితముగా వృద్ధియగుచున్నవి. అందుచే నిట్టివితయారుచేయు కంపెనీలకుగూడ నవసరముబయలు దేరుటకుసరిపోయినట్లుగాను వారిసంఖ్య నానాటవృద్ధియగుచున్నది. 1904సం॥ బొంబాయి రాజధానియందు జరిగినఎక్సిబిషనుందు ప్రదర్శింపఁబడినస్వదేశీయులో హాపువ

స్తువులును క్రవస్తువులును చూచినంతమాత్రమున నేమన దేశమందట్టివృత్తులు ప్రబలి యావస్తువులను కొనువారు విశేషముగానుండి యుండురనుటకు సందియము లేదు. ఇక్కడతయారుచేయబడిన వస్తువులయినప్పటికిని చెన్నపట్టణపుకంపెనీలలో కొన్ని మనపేరుంచినయెడల వస్తువులకు గౌరవముండదని కాబోలును తమకంపెనీల కాంగ్లేయనామకరణములను జేసియున్నారు. ఇట్టిది దేశాభిమానమునకు విరుద్ధమను మాటయటుండ స్వదేశ వ్యాపారమునకొక డాగువంటిది. అటులగాక కలకత్తాబొంబాయిరాజధానులయందు స్వదేశీయుల పేరనే కంపెనీలుండుటచే మన దేశమునకు గల గౌరవలాభములను చూచియయినను మనరాజధాని వారికనైన నట్టిలోపపుపనిని చేయకుందురుగాత! ఇదివరకున్నవారట్టియెరువుపేరులను తప్పించి తమపేరుననే తమవర్తకములను సాగించునంతటి దృష్టియును, ధైర్యమును కలిగి మార్చుకొనుటగూడ నుత్తమకార్యము మనదేశమున మనవారు ప్రచేయుచున్న సబ్బుబిళ్ళలును, రంగురంగుల సిరాలును, ఎక్కిళ్ళిపనులయందు చూచినవారెల్లరును గౌరవించియున్నారుగదా! వానినే మనవారు కొనుటకు తగినంత యవకాశము కలుగకపోవుటకు ముఖ్యకారణము వానిసంగతి దేశమందు జనసామాన్యమునకు సంపూర్ణముగా తెలియకుండుటయే. దేశాయికంపెనీ, నాసుర్జీపెటిట్

కంపెనీ, మానర్జి ఫ్రాంజియాజీ అండు సన్సు కంపెనీ, నులిమార్కజీ కరీంజీ కంపెనీ, మెసర్సు బాట్లిబోయి కంపెనీ, మెసర్సు ఆదంజీ పీరుభాయి అండు సన్సు కంపెనీ. హెంచ్, జోసు, కే. బీ. సేన్, మున్నగు కంపెనీల పేరులేమన వారిలో నెవరెన్నడు వినియుండరు ఇప్పుడు ఎక్సిబిషనుల మూలమునను, ఇండియన్ స్టోర్సుమూలమునను మన దేశపు కంపెనీలసంగతి వెల్లడియగుచుండుటవలన నాయా కంపెనీలయందు చేయబడునట్టియు విక్రయింపబడునట్టియు వస్తువులెక్కువగా నమ్ముడుపోవుట కవకాశముకలిగినది. ఇప్పుడు గృహోపకరణములయందును, వేషభాషలయందును, ఆచారవ్యవహారములయందును కలుగుచుండిన మార్పులు దేశమునకు క్షేమకరములా లేక యనర్థదాయకములా యనునంశమును విచారించుట మాపనికాదు. మార్పులు కాలమునుసరించి కలుగుచున్నవన్నదియే మేముచూడవలసినపని. మంచిదయిననేమి చెడ్డదయిన నేమి చేతులతోతినుట పేడతోనలుకబడిన నట్టింట విస్తరాకులలో భుజించుటయు, విసర్జింపబడి మేజాలపయిని పళ్ళెములలో చంచాలనివాడబడు ముళ్ళుగరిటలతో తినువారిసంఖ్య బ్రాహ్మణులలో కొద్దికొద్దిగను బ్రాహ్మణేతరులలో విశేషముగను ఇప్పుడిప్పుడు గన్పట్టుచున్నది ఏమాత్రముపాధి యుండినను నేటివుక్రైస్తవులాంగ్లేయులవలెనే భుజింతురు

అందుచేతనన్యదేశపు వస్తువులను గూడ తయారుచేసి మన దేశమందే కొల్లపెట్టుటకవకాశముగలదు. ఇది యిటుండ స్వదేశపదార్థములను విచిత్రములుగను, విడ్డూరములుగను, కృష్యాభివృద్ధికి మార్గదర్శకములుగను నన్యదేశీయులు కొనకమానరు. మననక్కపల్లి లక్కపిడతలును, విశాఖపట్టణపు దంతపుసామానులను, ఏలూరు తివాసులును, కొండపల్లి బొమ్మలును యెన్నో ప్రయత్నములు చేసి, ఐరోపా ఖండవాసులు కొని తెప్పించుకొని యత్యాదరముతో భద్రపఱచుచున్నారు.

కొన్ని సంవత్సరముల క్రిందట మచిలీబందరున తయారు చేయబడుచుండెడు కలంకారీచాదిరీలును, పలంగుపోషులును, మిక్కిలి ప్రసిద్ధికెక్కియుండినవి. స్వదేశవృత్తులకు పునరుద్ధారణము కలుగుకొలందిని, అవియన్నియు మఱల పొడచూపకమానవు.

రవివర్మవంటి చిత్రకారుఁడొక్కఁడు బయలుదేరినంత మాత్రముచేతనే యామహాపురుషునిచే వ్రాయఁబడినచిత్తరువులేవిధముగ ప్రతిపల్లెటూరునందున్న చిన్న దుకాణమునందుఁ గూడ నమ్ముచు వ్రేలుచున్నవో చూడుఁడు. పూనాచిత్రశాలవంటి శాలలభివృద్ధియై చిత్తరువులు వ్రాయుటలో ప్రావీణ్యతగూడ ఐరోపావారి వలెనే మనవారియందును బెంపుగాంచిన కొనువారా వెంటనే కనఁబడుదురు

౮. ఇప్పుడు పూర్వోదాహృతములగు చిత్రప్రదర్శన శాలలవలనను, ఇంజినీయరుస్కూళ్లను వలనను, ప్రభుత్వము వారు స్వదేశవృత్తులయెడలఁ జూపించు నాదరము వలనను, వార్తాపత్త్రికలవలనను దేశాభిమానముచే పట్టణముల వెంటను పల్లెల వెంటను తిరిగి హెచ్చరిక జేయు నుపన్యాసకులవలనను మనదేశమందు తయారుకాబడి యమ్మఁబడుచుండు నట్టియు, తయారుచేయుటకై యత్నింపఁబడుచుండు నట్టియు, పలువిధవస్తుసంపత్తి విషయమై తెలిసికొని సేతుసీతనగమధ్యవాసులేగాక యన్యదేశీయులుఁగూడ నట్టివస్తువులుకొనుటకయి వేచియున్నారు. కాన యంత్రశాలాభివృద్ధిచేసి యట్టివస్తుసముదాయమును వర్తకమున కొసఁగుటయే కర్తవ్యము,

---

# ఆయః ప్రభావము.



## 6 వ ప్రకరణము.



పూర్వావస్థ మారినదనియు, యంత్రశాలాభివృద్ధి యత్యవసరమనియు, యంత్రశాలావసరములైన ఖనిజములును ఉద్భిజ్జములును, మనదేశమందే దొరకగలవనియును, నాగూ యంత్రశాలలయందభిమానముతోఁ బనిచేయుజ్ఞానము మనవారియందు వృద్ధియగుచున్నదనియు, తయారు కాబడువస్తువులను కొనువారు మనదేశమందే కనిపెట్టుకొనియున్నారనియు నింతవరకు చెప్పియుంటిమి. ఇఁక యోజించవలసినది యంత్రశాలల నిర్మించి పెంపుచెందించి నిర్విఘ్నముగా కొనసాగించుటను గూర్చియైయున్నది. యంత్రశాలాస్థాపనశివమెత్తి హాశ్శేను హుశ్శేనని యగ్నిగుండముఁ దూకు మూర్ఖతురుష్కులగతి ప్రతివాఁడును దేశాభివృద్ధికి నేనుమొకయంత్రశాలనుస్థాపించెదనని ధనాదిసాధనముల బాగుగ యోజించక కంపెనినొకదానిని నెలకొలిపి. కొన్నిభాగములను సంపాదించి, కావలసిన మొత్తము

గాని, కార్యనిర్వహణశక్తిగలవారి తోడ్పాటు గాని లేనియెడ కొద్దిమొత్తములఁజముచేసి కొంతవరకు పనిసాగించి యుంతట త్రాడు చాలకున్న నూయిపూడ్చిన నీరందునను దుర్భ్రమతో తక్కువకిమ్మతునకొక తక్కువశాలలను నిర్మించి కొద్దివేతనములకు పనిచేయువారిం గుదిర్చి పనిసాగింపదొర కొనిన ఓలి తక్కువయని గుడ్డిదాసిని పెండ్లాడినవానిగతి సంభవించును. ఆదాయము తేగలుగునంతటి యవస్థకు వచ్చువరకును విధిగా వెచ్చించవలసిన మొత్తమును ముందుగ సేకరించుకొనవలయును.

ఏలూరువంటి పట్టణమున నేదోయొక సందులోనో గొందిలోనో బసదిగినవాఁడొకఁడు కూడలిబాజారునకు బోవలయునని బయలువెడలి పాముమెలికెలఁ దిరిగియున్న సందులవెంట కొంతవరకు నడచి యంతటితో ధైర్యము చెడియో నడుమ నత్తువయుడిగియో యింక నదిబొగలునను వగలిగిన సందులోఁగి రాజమార్గము చేరగలిగినను, అక్కడచిక్కిలబడిన యెడల బయటఁ వెడలిన బసచేరుటకును, శృంగాటము బ్రవేశించుటకుఁ గూడ చెడవలసి వచ్చును. ఉన్నపట్టున నుండక హనుమంతుడు సేతువు లంఘించిన వానివెంట దుముకయత్నించి నేలబడి యవయవములకు భంగిములకలుగ జేసికొనువానివలె సమర్థులు దూరము లోచించి సాధకబాధకములెల్ల యోజించి స్థాపించిన మంచి

యంత్రశాలలకే యొక్కానొకసమయమున దెబ్బతగిలి గ్రు
క్కుత్రిప్పుకొనునంతటికి తలప్రాణము తోకకు వచ్చుచుండు
గుడుగుడుగుమనిన గాలము వేయుమనుజుని పగిది యొక్కొ
రొకరిద్దరు తల్లడిల్లగ దీసికొనుచు జుట్టువిరియబోసుకొని పరు
వులిడుటవలన ప్రయోజనమెన్నడయిన కలుగునా? ఏకం
పెనీయందాయమునకు వీలులేక వ్యయమే చేయుచుండవలసి
న కాలమునకు సరిపడినంత మూలధనమును చూచుకొనకుం
డ పనిప్రారంభించబడునో యాకంపెనీయొక్క ధనము భూ
మిపాలై హరించును. అట్లుగాక కట్టడములను నిర్మించి బా
యిలర్లు ఇంజనులు మొదలగుయంత్రములును వానినినడపిం
చుటకవసరమగు పరికరములును మనుష్యుల నేర్పాటుచేసి
పని చేయుటకు ప్రారంభించునంతటివరకు నతిప్రయాసమీ
ద దీపము నిలువబెట్టినను ఆపయిన సాగించుటకు చమురు లేకు
న్న యెడల వత్తిదగ కాలి ప్రమిదె పగులును. తాము నడచు
చుండిన యేమార్గమునకు విఘ్నము వచ్చినను మూలధనము
ఖర్చగుటచే నంతటితో తాను చేయుపని విడుచుకొనును. ఒక వేళ వి
శ్వప్రయత్నము చేసి ధనము సంపాదించుట కవకాశముండిన
నొండుపలుకుబడి కలిగినవాండను విసర్జించినట్లులనే చెడినకాపుర
ముకోలుకొననేరదని నిరుత్సాహులై యాకంపెనీవారు త
మంతట తామే యుద్యమమును చాలించుకొందురు.

ఇదియుటుండ నింకొకచిక్కు కూడకలదు. యంత్రశాల స్థాపించుటకును ఆయంత్రశాలకు గావలసినసరకులను కొనుటకును కొన్నసంవత్సరముల ముందుగా పదార్థములక్రింద ఖర్చుటకును చాలినంతధనముండి పనినిర్విఘ్నముగ సాగినవస్తువులు తయారగుచున్నను నంతకుమించి ధనము లేకున్న యెడల వెనుకటిగతియే తటస్థమగును. ఎక్కడనో యొక యంత్ర శాల వస్తువులు తయారు చేసిన దన్నతోడనే చలమునకు పెట్టుబడి చేసినటుల కొనువారు సిద్ధముగా కనిపెట్టుకొని యుందు రనుటకు వీలులేదు. క్రొత్తగా యంత్రశాలను స్థాపించువారు రాత్రిందివములు దానివిషయమై యోజించుచు కలవరించుచుండిననట్టి యంత్రశాలయొకటి యున్నదని ప్రజలు కనుగొనుట కెంతకాలమో పట్టును. త్వరితముగనో యాలస్యముగనో యాకంపెనీవిషయమై ప్రజలకు తెలిసినను దా నియందు లక్ష్యముంచి దానియందుండుసరకులను ఇతరకంపెనీలయందలి సరకులతో పోల్చిచూచి గుణాగుణములు కనిపెట్టునంతటిశ్రద్ధ ప్రజలకు గలుగుటకు మరింతయెక్కువకాలము పట్టును. ఆకంపెనీయొక్క పుణ్యావశేషముచే నక్కడక్కడ నొకొక్కడిప్పటి వస్తువులనాడెమును బాగుగ గ్రహించినను క్రమక్రమముగ తనఖాతాదారులదృష్టిని యిటువైపు త్రిప్పి దీనియందలి వ్యాపారమును విరివిగసాగునంతటి ప్రకటనము

గలుగుట కెంతకాలముపట్టునోమీరే యోజింపుడు. అం
తవరకు దక్కాముక్కీలకాగి నిలిచినవెనుక గదా లాభము
ప్రారంభమగును. ఒకసారిలాభమారంభమైనవెనుక నిక
చెన్నగండములు దాటినవని గుండెలుకుటబడివ్యవహార
మునునడుపవచ్చును ఇదియంతయు నెరవేర్చుట మాటలతో
లేదు. ఇంతవరకునుప్రాణములునిల్పుకొనుటకు ధనమాధా
రము ధనమొక్కటియున్నంతమాత్రమునచాలదు. కంపె
నీనిస్థాపించుటకు కారణభూతులైన యొకరిద్దరు తామెంత
ధనవంతులైనను తగినదేశాభిమానమును ధైర్యసాహస
ములును వారికిలేకున్నయెడల చిక్కువచ్చినపుడు విరివి
గొంథనముపెట్టుబడి పెట్టుటకట్టివారు జంకుదురు. ఆరంభ
శూరత్వమొకప్పుడు గలిగియుండి యొకటిరెండుతాకుడుల
కుధనమడ్డమువేసి నిలువబడినను తుదముట్టువంతటివరకు
ను నట్టివారికి శాంతమునుపట్టుదలయుండుటయరుదు. ఇట్లి
నివిరుత్సాహులవను కావలసినయవసరము లేదు. ఈపనికి
పూనుకొను వారదివరకు కొంతయనుభవముగలిగి తాము చే
యదలంచుకొన్న కృషి మంచిదనియును దేశమున కవసర
మగునదియనియును పూర్ణమైన నమ్మికతో బయలుదేరిన
యెడల వారియనుభవజ్ఞానము వారికి చేయూతయై యవస
రముగు శాంతమునుపట్టుదలను పుట్టించకమానదు అట్టి
వారికి తక్కిన ధనాదిసదుపాయములన్నియు గలిగియున్న

సమానము నడుమ నట్టియవాంతరములును చిక్కులును కష్టములును దోషహానులును కలుగుచుండినను వారి కష్టము గట్టెక్కక మానదు. కనుక మొగట పూర్ణముగ యోజించక యిట్టికార్యములకు సమకట్టగూడదు. సమకట్టి మానము దిగిన వ్యాపారము నిరర్థకమని పూర్ణముగ ఋజువు కనపడువరకును వెనుకంజయిడక పూనికతో కొనసాగింతమను పట్టుదలతో నుండవలయును. బంగారు గనులకంపెనీలు జూదగాండ్రవంటివని యిదివరకు చెప్పియున్నాము, అట్టికంపెనీలలో కొన్నిటికఖండైశ్వర్యము కొన్నిటికి నాశనము సంభవించుచున్నది. దేశాభివృద్ధికివలయుకంపెనీలట్టిపనులకు దిగకూడదనుగదా యిట్టి వ్యాపారములలో దిగియును యీప్రకరణమునందిదివరలో చెప్పబడినదురవస్థలకులోనయ్యి చెడినకంపెనీలలో తమ సొమ్ము వేసికొనినవారు నోరుగాలిన పిల్లి చన్నీళ్ళకు వెరచునన్నట్లు యెట్టి లాభకార్యమున కెంతసమర్థులటుపిమ్మట ప్రయత్నము చేసినను జంకి విముఖులై బెదరుచుందురు. తాజెడ్డ కోతి వనమెల్ల చెరిచె నన్నట్లు మంచి చెడ్డల యోజించకయుండుటకు పిరికులవలెగంతులిడ విరగబడినవారు తమకంపెనీకి చేటుదెచ్చుటయేగాక యిటుపైని యంత్రశాలాభివృద్ధికై పాటుపడు సత్పురుషుల ప్రయత్నములకును భంగముకలుగజేసినవారగుదురు. కావున దేశాభిమానము

గల వారెల్లరు నప్రయోజకులు నవినీతులు నసమర్థులును నిట్టి దుష్కార్యములను తలపెట్టిన స్నేహభావముతో వారితప్పు వారికిబోధపఱచి యితరులట్టి యుద్యమములకుదిగి చెడకుండ హితబోధ చేయుటయు స్వామికృత్యము. మన దేశమున యంత్రశాలాభివృద్ధివలనను వర్తకవ్యాపారనిపుణతలవలనను గలుగునట్టిసంపద పారశీకు లెక్కువగాననుభవించుచున్నారుగదా! తాము చేయు ప్రయత్నములయందు సంభవించిన యిక్కట్టులలోనుండి, తప్పిబయటపడి ధనికులై తామైశ్వర్యమనుభవించుచు దేశాభిమానముతో లోకోపకారకార్యములు చేయుచున్న వారు వారిలో నెందఱో యున్నారు.

అదివరకు పారసీకులను నుద్ధరించి యశఃకాయులై స్వర్గముచూరగొన్న సర్, జేమ్సెట్ జీ, జిజీభాయి, సర్, డిన్షా, మాణిక్ జీ పెటిట్, మొదలగు మహాపురుషుల పాటటయుటుండ మొన్నమొన్నటివరకు లోకోపకారమునకై ధర్మబుద్ధి శోధనము వెదజల్లి హిందూదేశాభివృద్ధికై స్వసుఖమును వెనుకబెట్టి పాటుబడుచు కొద్దికాలము క్రిందటనే లోకాంతరగతులయిన సత్తాతా గారిచరిత్ర మువు ధనాధికులకందరకు నుమార్గదర్శకము. సజీవులై యున్న వారిలో బొంబాయిపట్టణమున మూర్ధాభిషేకము లేని రాజని సుప్రతిష్ఠగన్నది. ఆనరేబిల్ సర్ ఫిరోజిషా మెర్వాన్ జీ మెహతా, యం.ఏ.

కే. సి. ఐ, ఇ. గారికిని బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషనునకు హానరెరీ శెక్రటరీగాను మిల్లు ఏజంటునునగు డిన్షా, ఎదుల్జీ, వాచాగారికిని గల దేశాభిమాన మేలెట కాంగ్రెసునకుపోవు యాత్రార్థుల కెల్లరకును విశదమే పైన చెప్పబడిన పారసీ ప్రముఖులవంటివారు మన ప్రెసిడెన్సీయందుకూడ కొందఱు బయలువెడలి మార్గప్రదర్శకులైనుండిన మన ప్రెసిడెన్సీయును మంచిదశకు తప్పక వచ్చును. ప్రతివారును లక్షలకొలది ధనము వెచ్చించి యంత్రము లకేర్పఱచి పనిచేయవలసిన యవసరము లేదు. తలకుదగనిపద్దులిడి బోర్లబడుటకంటె మనకు సాధ్యమైనపనిని జాగ్రతతో చేసికొనుటవలన మనకును యితరులకునుగూడ లాభము గలదు అతిచనువుగ నొకనాంగ్లేయ రాణిచే దరిచేర్చఁబడిన గొప్ప యుద్యోగున కొకనికామె కన్నెగానున్న యవకాశమును పురస్కరించుకొని యామెయంతఃపురము గోడపై యీగోడనెక్కఁ బ్రాకవలయునను కుతూహలము కలదుగాని పడిపోదునని భీతి పొడముచున్నది. అని వ్రాసి తొలఁగిపోవ నారాణి దానిఁజూచి యెక్కఁబూనినపడుదువని భయమున్నఁగల గోడ నెక్క బ్రయత్నింపకుము అని వ్రాసెనట. ఆరీతినే మనకునగుననిపూర్ణమైన ధైర్యమును విశ్వాసమును కలిగినప్పుడే యాపనికి దొరకొనవలయును. మన దేశమున కొద్ది మొత్తములతో స్థాపించి పనిచేయుటక

న్యాయమైనవృత్తులనేకములుగలవు. తాళములుచేయు కమ్మరు
లును కంచుపోతపోయు కంచరులును సంఘముగా చేరి నూ
తనయంత్రములతో పనిచేసి వస్తువులనానేకమును తమలా
భములనుగూడ వృద్ధిచెందింపవచ్చును. కొవ్వొత్తులు, స
బ్బుబిళ్ళలు మొదలయినవి చేయుకంపెనీలు స్వల్పమొత్తము
లతో స్థాపించి చుట్టుప్రక్కల బాజారులలో నమ్మవచ్చును.

పరిశుద్ధమైన గాలిగలుగునట్టి యారోగ్యప్రదేశముల
మంచిగృహములనుగట్టి యేయశుభ్రతయును లేకుండ జీవిం
చుచుండువారల గృహములయందును గూడ మశూచకము
లును, మరిడీజాడ్యములును నప్పటప్పట తటస్థించుచుండ
నందులకు నిజమైనకారణమును మాధ్యముచే కనుగొనజా
లక శాస్త్రములన్నియు వట్టివ్యర్థములనియు, శివునియాజ్ఞ
లేక చీమకుట్టదనియు, అమ్మవారికాగ్రహమువచ్చి పాపా
త్ములను నోట వేసికొనుచున్నదనియు నమ్మి యింటింట
వేపాకుతోరణములంగట్టి గరగల నూరేగించుచు జాతర
లుచేయుచున్నారు. మనమెంత శుభ్రముగానున్నను తిను
పదార్థములును, ధరించువస్త్రములును, వాడుకొను వస్తువు
లును తయారుచేయువారుకూడ సుఖాధారప్రకాశికలం జ
దివి తాముకూడ నారోగ్యముగనుండనియెడల మనశుభ్ర
తవలని ప్రయోజనములేదు. మనకు పాలు, పెరుగు, వె
న్నలనమ్ము గొల్లదానిబిడ్డకు మరిడిజాడ్యము తగిలిన దినము

లలో నా శిశువునకుపచారము చేయుచుండు వృత్తిని మాను కొనజాలక యా దినములలో మనకిచ్చు పాలనో, పెరుగునో, వెన్ననో విశూచి విషకీటక మాశ్రయించి మన యింటిని గూడ పాడు చేయును. చాకలివాండ్రు బట్టలుతుకు చెరువులను నానా జాతివారు ధరించు వస్త్రముల నన్నిటిని కుప్పగా వేసిన ప్రోవులను చూచిన నెవ్వనికి నొడలుకంపింపకుండును. రొట్టెలు చేయువారును బజారంగళ్ళ శాకపాకములను మిఠాయిలు నమ్మువారును జాగ్రతగానుండనియెడల లాభము లేదు. అట్టివస్తువులనన్నిటిని తయారు చేయుటకు మంచికంపెనీ లేర్పడి ఆరోగ్యతాపత్రికలను పొందినవారిని నియమించి రోగములేని పశువుల పాలతో వెన్న పెరుగు తయారు చేయించి యుంచుట యత్యావశ్యకము. అటులనే రొట్టెలు చేయుటకు కంపెనీలేర్పడుట మేలు. ఈవిధమున నెన్నెన్నో వృత్తులను మూఢుల చేతులనుండియు మోసగాండ్ర చేతులనుండియు తప్పించి యాయావృత్తులయం దనుభవముకలిగి, యాయా శాస్త్రముల పఠించి యుండు కృతార్థులయినవారి నేర్పరుచుట కెంతో యవకాశమున్నది మనకుభోగావసరములయిన వస్తువులనేకములు గలవు. వానిని తయారుచేయు యంత్రశాలలయందలి యంత్రములును పనిముట్లును చేయుటకెంతె

న్ని యౌన్నత్యములుగావలయును. కాని యిల్లలికినంతమాత్రమున పండువు కానేరదు.

యంత్రశాలాభివృద్ధియై వృత్తులు బాగుపడుట రెప్పపాటులో జరుగునది కాదు. నిలకడమీఁద లాభము కాన్పించును. అంతవరకును తగుధైర్యముతోడను యోగ్యతతోడను ధనముతోడను పట్టువిడువక పనిచేయుచుండునట్టి యువకాళము సర్వేశ్వరుఁడు మనకుఁగలుగఁజేయవలెను. అంతవరకును తప్పటడుగు లిడి తలక్రిందులపడుచు నొకరినిఁ జూచి మరియొకరు నిరుత్సాహులగుచుండుటయే సంవృత్తమగును. ఇప్పటికాలస్థితిఁ బట్టిచూడఁగా దైవము మనపట్లనున్నట్టుల చిహ్నములు గనిపించుచున్నవి. ఇప్పుడిప్పుడు కాకులు కావుకావుమన నిద్రనుండిలేచి కన్నులునులుపుకొని రెప్పలు విప్పుకొని దృష్టులు సారించుచున్నారము. అరుణోదయమగుచున్నయది. సూర్యబింబము కొద్దికాలములలో దిక్చక్రమును దాటి బయలెక్కి వెలుగును వెదజల్లనున్నయది.



# అయః ప్రభావము

## 7 వ ప్రకరణము.



యంత్రశాలాభివృద్ధి దేశావృద్ధికి మిగులయవసరమని చెప్పియుంటిమి అట్టియంత్రశాలాభివృద్ధి తనంతనకలుగనేరదు. జనసామాన్యమునకు యంత్రములవైపు దృష్టి తిరుగవలయును దానికి కొంత ప్రయత్నమవసరము. అట్టి ప్రయత్నము పలువిధములుగానున్నది యంత్రశాలలు దేశమందంతటయు నిర్మించి వాటిలాభము ప్రత్యక్షముగ ప్రజలకు గనుపరుపవారికి యంత్రశాలలు నిలుపుటకు సహకారులగు బుద్ధిపుట్టకమానదు అట్టి బుద్ధి పుట్టినపిమ్మటగాని దేశమందంతటను యంత్రశాల నేర్పరచుట కష్టతరము. ఎవరోసాహసించి కార్యమునకు దిగవలయును. ప్రజలకుగలయజ్ఞానమును పోగొట్టుటకర్తవ్యమని నొక్కి వ్రాయనవసరము లేదు. ఉపన్యాసములవలనను గ్రంథములవలనను దేశాభిమానులు బయలుదేరి తోటివారికుపదేశింపవలయునుగాని యిట్టియుపదేశముకన్న ప్రత్యక్షప్రమాణమెక్కువగా హృదయమున కత్తుకొనును. రా

రామాయణాదిపురాణగాథలు విని గ్రహించుటకన్న చిత్రకు
వులమూలమున నెక్కువగా తెలిసికొనవచ్చును. చిత్రకారుల
కన్న ప్రతిమలజేసి యొకయశోకవనమునిర్మించిసీతాదేవి
యొక్క విగ్రహమునందుక్రిందనుంచి రాక్షసస్త్రీలప్రతిమల
నావిగ్రహమునకుచుట్టు నిడుదకోరలుమిడిగ్రుడ్లువివృతా
స్యములుగల వికృతభీకరాకారములతో చెక్కియొకచోట
నుశ్రీరామరావణయుద్ధము నిజముగా చేయుచున్నట్లు వానరు
లనురక్కసులను కర్రతోడనో లోహముతోడనో చేసి
చూపినయెడ చిత్రకారులజూచినకన్న నెక్కుడుగ గ్రహిం
చుస్వభావము మనకుగలదు. ఉపన్యాసము లిచ్చుటకన్నను
గ్రంథములు వ్రాయుటకన్నను పటములవలనను విగ్రహ
ములవలనను జ్ఞానోదయాభివృద్ధులు కలిగించుట కెక్కుడు
తోడ్పాటును ధనమునుకావలయును. ఈరెండునున్నయెడ
ల దేశమునందొక్కొకతరి నొక్కొకచోట సభలునిర్మించి
యాసభలయందు నానావిధోపయోగ వస్తుచయమును స
మకూర్చియుంచిన వాటింజూచి సంతసించుటకును పలువిధ
ములగుప్రవృత్తులు పెంపుజెందుటకును అవకాశముగలదు.

ఇట్టిసభలమూలముననే యూరోపాఖండమునందలి దేశ
ములత్యధికముగా పెంపుజెంది నానావిధ కృషివ్యాపార
ములయందు బలసి విలసిల్లుచున్నయవి. 1851 సంవత్సర
మున లండను నగరిమున జరిగినవస్తుప్రదర్శన సభవలనవ్వ

త్తుల కెంతప్రోత్సాహమైనను కలిగినది. ఆసభకు మన దేశమునుండి అమూల్యములగు పదార్థముల నేకములు పంపబడినవి. వాటినిజూచి పాశ్చాత్యులు మెచ్చి తలలూచియుండిరి.

1855 సం॥లో మన రాజధానులందుకూడ సభలు ప్రారంభమయినవి అంతకుపిమ్మట మనదేశమున రెండుమూడు సభలుజరిగినవిగాని కొద్దికాలములోనవి యంతరించినవి. ఈసభలవలన గలిగినలాభమొకసభయందు కన్నదానితరువాత జరిగిన దానియందెక్కువ యయినట్లు వాటి వాటియందు ప్రదర్శింపబడిన వస్తువులయందు నుపయోగించినపని మూట్లయందు వెల్లడియగుచువచ్చినది.

భూమిలో నాటినవిత్తు మనకన్నులకగుపడక కుళ్ళికృశించినట్లు భ్రమపుట్టించి తొలకరివానకు మొలకయెత్తి మొక్కయై పెరిగి శాఖోపశాఖలతో గొప్పవృక్షమగునటుల ఆసభలవలన దేశముయొక్క మనస్సుననాటబడిన జ్ఞానబీజము మగంటినట్లుండి కాంగ్రెసు మహాసభ చేయు కృషివలన మొలకయెత్తి దోహదముచే నేపుగాపెరుగ నారంభించినది. 1901 సం॥ మున కలకత్తాలోజరిగిన కాంగ్రెసు కుపశాఖగా మొదటివస్తుప్రదర్శనసభనిర్మింపబడినది అదివరకొకయర్ధశతాబ్దమునకుముందేయిట్టిసభలు జరిగియుండగాయిది మొదటిదెట్లగునని కొందరికి తోచవచ్చును ఆసభలుప్రభు

త్వము వారివలన నేర్పఱుపబడిన వగుట మనహారికప్పడీ స
భలయందలి యాసక్తియు నాదరణయు నెటులుండెనో
తెలిసికొనవీలులేదు. అందుచేత నాసభలను మనసభలను
టక్కు వీలులేదు. కాంగ్రెసుసభకుప్రభుత్వము వారి పోత్సా
హమ్మమియుసులేదు. దీనివుట్టుక కొకగవర్నరుజనరలుగారు
కారుకులైనను పిన్నవయసునందీ కాంగ్రెసువలు నీలాపనిం
దలపాలై తినధారాళమగు నడవడిచే యోగ్యతనుగనుపఱ
చుచు పెద్దవారెన్నడును చెడ్డవారుగారన్నలోకోక్తి ప్రకా
రము తన్ను దూషించువారియెడల కార్పణ్యము, నీర్ష
యు పూనక దేశోపకారబుద్ధితో పనిచేయుచుండ ప్రభు
త్వము వారితిగారాబముతో నత్తి ముద్దు లాడ కున్నను
కాంగ్రెసునభయందు కొంతకాలముక్రిందటగల దురభిప్రా
యము రాజకీయోద్యోగులకిప్పుడు తగ్గిపోవుచున్నది. అట్టి
కాంగ్రెసుసభకుపశాఖగా నుండుటచే 1901 సంవత్సరము
నుండి ప్రతిసంవత్సరమును జరుగుచున్న వస్తుప్రదర్శనసభ
రాజకీయోద్యోగిసంపర్కము లేనిదనుటకు సందియమిం
చుకయు నుండబనిలేదు. రెండవసభ యహమదాబాదు
నందును, మూడవది చెన్నపురియందునుజరిగినవి. నిరుటి
సభ యఖండవిభవసంపన్నమగు బొంబయి పట్టణమున జ
రిగినది. ఇది తక్కినయన్నిటికన్నను మిగుల యుత్కృష్ట

మాయినది. ఈసభాసౌందర్యవిభవముల జూడ వేయికన్ను లుగావలెననుట యత్యుక్తిగా నెన్నదగదు.

అతి సుందరమగు బొంబయి పట్టణమం దుత్తమమగు అండము (Oval) అనుపేరంజెన్నొందు ప్రదేశమున నీసభ బ్రహ్మాండముగ నిర్మింపబడినది. ఈసభక్రిందవినియోగపరచబడిన ప్రదేశము ఇరువదియైదు యకరములవిస్తీర్ణము. దీని నిర్మాణమున కింతకన్న మంచి ప్రదేశ మీరాజధాని యందు లేదు దీని కొకవైపు శక్రటేరియాటు యొక్కయు హైకోర్టు యొక్కయు విచిత్ర హర్మ్యములును, రెండవ వైపు సముద్ర తీరమును, కన్నుల పండువు గావింపుచుండెను. యుధిష్ఠిర రాజసూయయాగమున కానాడు సభ నిర్మించిన మయుని యంతటి శక్తి యుక్తులును అనుభవజ్ఞానములును గలవాడు వక్క సన్యాడీయిరువదియైదు యకరములబయలును చిత్రవిచిత్ర భవనాదులచేనలంకరింపజాలడు. ఈసభకు శక్రటరీలలో నొకరయిన ఖాన్ బహదూర్ యమ్, సి, మర్జబాన్, సి, ఐ, ఇ, యమ్, ఐ, సి, ఇ, గారు దీనిప్లాను తయారుచేయ ప్రదర్శితపదార్థజాతమునకు దాయమ్ములకును వినోదములకును డెబ్బదిగృహములు నుపకారికాభవనములు నివిశాలప్రదేశమున నేర్పరుపబడి చుట్టునావరణ కట్టబడినది. ఈయెగ్జిబిషను దరికేగినతోడనే ఆగాలిలోనిటాజమహాలువంటి దివ్యభ

వనము నేత్రోత్సవము చేయును. అందు జవాబులుగ నుం
చబడిన గవాక్షములు మున్నగు ద్వారములును గోపురము
లును చూచి యానందించవలెగాని వర్ణింపనలవిగాదు. ప
గటివేళ జూచిన నెంతో వింతగనుండునట్టి యీప్రధానద్వా
రముయొక్క వైభవము పొద్దుగ్రుంకిన వెనుక యేమని వ
ర్ణింతుము. చక్కగ మలచబడిన పాలరాయితో కట్టినట్లు భ్రమ
పుట్టించు నా శ్వేతమందిరమును కొంతదవ్వులనుండి జూడదా
నియందంతటను తగిలింపబడిన విచిత్రవర్ణములుగల చిన్నచి
న్న గాజుబుడ్లు చేనవరత్నములు చెక్కినట్లు పగలుగనుపడున
ట్టి యానిర్మాణము పొద్దుగ్రుంకిన వెనుక తటిత్ప్రభాదీపకళికా
వారితప్రభావమున జ్యోతిరింగణములచే కప్పుకొనబడిన వెం
డికొండవడువున వెలుగుచుండును. కించిదున్నత ప్రదేశమునుం
డియీసభవైపు దృష్టిసారించిన నిందలి దీపసముదాయము
మిణుకుమిణుకుమని చుక్కలచే సొంపెక్కిన గగనఫలకము
నందలి శకలమొక్కటి విరిగి నేలబడినట్లుగనుపట్టును. సింహ
ద్వారముయొక్క చోద్యములజూచుచు దానిం దాటలేక దాట
లేక లోపల ప్రవేశించిన వెనుక మున్నుగన్న యీసౌందర్యము
ను లోపలిహజారముల వైభవము తలపునకు రానీయదు.
అందలి విచిత్రములెల్ల వర్ణింపబూనినకొన్న దానికై వేరొ
క యుద్గ్రంథము వ్రాయవలయును. అసభావర్ణన యీగ్రం
థమునకంతగా యవసరము లేదని యెరిగియుండియు కని

యాదందించినదోషమున నింతవరకైనను వర్ణింపకుండుట కు మనసంగీకరింపదయ్యె. ఈసభా ప్రాముఖ్యమునుగూర్చి వేయువాక్యములు చెప్పనేల! కన్యాకుమారి మొదలు చలిమలవరకు వ్యాపించియున్న పట్టణములనుండియు ప ల్లెలనుండియు వచ్చి యీసభనలంకరించిన నానావిధవస్తు సంఖ్య డెబ్బదివేలు ఈసభయుండిన యేబదిదినములలోను వీక్షించినజనసంఖ్య దినమునకు 10,358 వంతున 570,167 ద్గాకుండెను. దేవిడిను కముక్రిందను వినోదములవలనను చం దాలు వర్దిలుమున్నగువాటివలన సభకువచ్చిన యాదా యము రు 2650 0 లు

ఈసభయందుప్రదర్శింపబడినవిబహువిధోపయోగము లైనవి. వడ్లంగి,కమ్మరి,కంసాలి,సాలి, కుమ్మరులకును,వ్యవసా యాదులకుపయోగపడు పనిముట్లును అట్టివృత్తులవలన త యారుచేయబడిన పలుతెగులవస్తువులును నవధాన్యము లునారలునోనగునవియును శిల్పాదిచిత్రవృత్తులును లోకో పయోగమునకునలంకారమునకు వినోదమునకు ననుకూ లములగు బహువిధవస్తుసంచయమును ప్రదర్శింపబడినది.

ఇట్టిప్రదర్శనములవలన దేశమునకధికలాభము గలదు. పూర్వాచారమునకు దాసులమగుమనకు మార్పుపేరుచెప్పి నమాత్రమున తలకంటగించును. నాగలిచేతబట్టుటకును చాలునకుదిగుటకు నుపక్రమించెడు దుక్కపైసుత్తి మోపుటకును

పురోహితుడు ముహూర్తము నేర్పరచి పసుపుకుంకుమలు పెట్టవలసియున్నగతి నొందు పాతపనిముట్లనువిడిచి వాని కన్న మెరుగైన యన్యదేశపువాటిని ముట్టుటకును పాత. పద్ధతులవిసర్జించికొత్తనమూనాల నవలంబించుటకును వెనుకదీయువార నేకులుందురు. ఎట్టిస్వల్పకార్యమునకైనను పూర్వాచారమునువిడచిన రౌరవాదినరకములు పాలగుదుమనను పనివానిమనమును బోధచే బాగుచేయుట కష్టసాధ్యము. బ్రహ్మక్షత్రవైశ్యశూద్ర జాతములోకదానితో నొకటికలియకుండగోడలు పెట్టబడినను కాలక్రమమున నవిబీటలువారి శిథిలమగుచున్నవి ఏజాతివారాజాతి వృత్తులయందుండుకాలము దాటిపోయినది. విద్యయైననమ్ముకొని యెరుగని బ్రాహ్మణులు కల్లమ్ముకొనుచుండుటయు ఆయుధపాణులై కదనతలమున మడమదిరుగని రాచకులమువారు మేడితో కపట్టి వ్యవసాయము చేయుటయు బ్రహ్మక్షత్రియులకు వశ్యులై యడగియుండెడు వైశ్యులు దండధరులై దండవిధాయి యుద్యోగముల తప్పుచేసినవారి దండించు చుండుటయు వేదబాహ్యులై బ్రాహ్మణశుశ్రూష యే గతిగా నుండిన నాలవజాతివారు వేదవేదాంతపారంగతులయి పయిజాతులకుగురువులుగానుండుటయు మనమెరుగనివి కావు దీనికంతకును కారణము రాజ్యాంగపద్ధతుల సమత్వబుద్ధితో డన్ని జాతులవారిని జూచు ప్రభుత్వమున యొననికిదేనివల

నసుఖజీవనము సులాభమును గలిగి కుటుంబమాత్రపోషణమో
దాస్యవృత్తి నవలంబించుటకే యుద్దేశము లేక యుండుట జా
తిమతభేదములతో సంబంధము లేక బ్రాహ్మణుడును చండాలు
డును గూడ నొక్క రీతిని చూచి యానందించి బాగుపడుటకై
యుద్యమప్రదర్శనము లేర్పడుచుండుటచే నెవ్వడేవృత్తియందు జీ
వించుచున్నాడో వాడావృత్తియందితర దేశముల నధికలాభ
ము నొందు వారిపని ముట్లను జూచి తాను మోహించునవి తన్న
ప్పుల పాలు చేయుచుండ దూరమున నుండు వారి సంపదతోను
న్నారని తెలిసికొని యంతమాత్రముననే స్వలాభము దలచి
యాకొత్త పనిముట్లను కొత్త రీతుల కృషి చేయు పద్ధతులను
తాను కూడ ప్రారంభించక మానడు అందుచే దేశమునందు
గల మూఢభక్తియు నాచారదాస్యమును తొలగిపోవును
అట్టి యుత్తమదశ మన దేశమునకు కలిగిన వెనుక మనలను
మించి యభివృద్ధినొందగల దేశముండుటకు వీలులేదు.
లోకములోని యే భాగమున నమ్మబడుచుండు వస్తువులత
యారు చేయుటకను గుణ్యమయిన యే పదార్థము మన దే
శమునందు దొరకదు! ఇంత వస్తుసమృద్ధి గలిగి ప్రజలకు జ్ఞానా
భివృద్ధియై కృషియందును వ్యాపారమందును పరరాష్ట్ర
ముల వెనుకదీసికొనిపోవు ముట్టినప్పుడు ప్రస్తుతమన్యదే
శీయులవద్ద కొనవలసినవన్నియు నిక్కడనే తక్కువఖర్చు
తో తయారుచేసి మన దేశమున నుపయోగించుటయే గాక

యన్యదేశములకుఁగూడ నెగుమతిచేసి వేలకొలఁది వత్సరములకు పూర్వమనుభవించిన యౌన్నత్యము నైశ్వర్యమును మరలనొందుటకు సందియములేదు.

ఇట్టిసభలయందు నాగళ్ళు, సుత్తులు, కొయ్యలు, నారలు, పీచులు, తవ్వకోలలు, పెట్టెలు, బుట్టలు పెట్టుకొని కూర్చుండిన దర్శనీయముగ నుండవు అట్టిసభను చూచుటకు ప్రజలు తీర్థములకుమూగినట్లు మూగరు. చిత్రవిచిత్రములును, సరసవినోదములును, శృంగారాలంకారములును గూడనుండినగాని జనసామాన్యమునకు రుచిపుట్టదు. ఒక వాద్యమును వినుటకో, నానావర్ణములతో నెగురు పతాకలం జూచుటకో దీపావళింజూచి యానందించుటకో సొంపైనప్రతిమలనో, విడ్డూరములగుపటములనో గనుగొని సంతసించుటకో, సభకేగినవాఁడందలి వీథుల వెంట తిరుగుచు తిరుగుచు తన వృత్తికి లాభకరమయినట్టియు, బుద్ధికి వికాసముగలిగించునట్టియు వస్తువులపై కన్నువేయకేమాత్రము పడసి యిదివరలో ప్రదర్శనయాత్ర సలిపినవారం దఱు నెఱుఁగుదురు. ఏవృత్తియందుండువాఁడా వృత్తితో సంబంధించిన యపూర్వపదార్థములఁజూచినప్పుడు వాటిని విచారించి వాటిని గూర్చి మూలముట్టుగ తెలిసికొనక మానఁడు ఎట్టిచిన్నయంత్రమునుగూర్చియైనను పొడిమాటలవలన జ్ఞానాభివృద్ధియంతగా కానేరదు. పటములువేసి

చూపించిన నంతకంటె బాగుగ తెలియును. అట్టియంత్రము నేచూపిన ప్రత్యక్షప్రమాణమువలన పూర్ణముగ తెలివిపుట్టునని ఇదివరకే చెప్పియుంటిమి. మరమేకులను కోయ యంత్రమునుగూర్చి మాటలతో నెంతచెప్పినను గ్రహింపజాలనివాడు దానిని వ్రాసిచూపిననంతకంటె కొంచెముబాగుగ తెలుసుకొనును. ఆయంత్రమునే యెదుటనుంచి విప్పి దానిభాగములన్నియు కన్నులకగుపరచి వానియెదుటనె కమరమేకును కోసిచూపిన నిక వానికాయంత్రమునుగూర్చి చెప్పవలసిన దేమియునుండదు.

ఇంటగూర్చుండబెట్టి యంత్రములు నేర్చుకొమ్మనిన బుద్ధికిభారముతోచును. ఆసక్తిలేనివిద్య పెంపుజెందదు. కాంగ్రెసుసభతో జరుగునట్టి యెగ్జిబిషనులు చిత్రప్రదర్శనశాలలు గావున వాటియందుతిరుగుటకుగాళ్ళకు నొప్పిపుట్టను. చూచుటకు కన్నులకు విసువురాదు. చూచుచుండు విచిత్రములొక్కరీతివిగాక అడుగడుగునకుమారుచుండుటచేత మనమునకుత్సాహము క్రొత్తక్రొత్తగపుట్టుచుండును. ఈసభ విప్పియెదుటనుంచిన యుద్గ్రంథమనజెల్లు

ఈసభవలనయింకొకగొప్ప లాభముగలదు. బహుకాలమునుండియెక్కడవారక్కడనేయుండుటచేత నొకరిమంచిచెడ్డల నొకరెరుగకపోవుటవలని యైకమత్యాభావమువలనగలుగునట్టినష్టములనుమనదేశమనుభవించుచున్నది. కా

నొక పెద్ద జెండా నిలుపబడినది. లోన నేమున్నదియు తెలియదు. ముఖద్వారమున నొకడుండి "మంచివింత చూచిరండి చూచిరండి" అని హెచ్చరించుచుండును. లోనికిబోయి నడువనారంభించినను నిన్నియుచిక్కులే. పదిగజములు నడిచిన వెనుక దారికడ్డముగ బల్లగోడయుండును. వెనుకకుదిరిగివచ్చిన దారిని బయటకుపోదమన్న మరియా దారిదొరకదు. తప్పుదారులు భ్రమపెట్టి అటునిటునడపించి నడపించి ప్రాణము విసివించును. ఈమధ్యకాలములో కలసిప్రవేశించిన వారొకరినొకరు విడిపోయి మరలతమవారిగలసికొన జాలకయలుకులాడుచు తమవలె దారిదప్పినవారలు తమ్ముగలసిన కొంతనవ్వు కొంతవిసవు మనమున జనించిడబ్బు పెట్టి. తద్దినముకొన్నందుకు తమ్ము తామనిందించుకొనుచుండ లోపల జనసమ్మర్ద మెక్కువయగునని యెరిగియుండి యందొకగోడపై గూర్చునియున్న వాడాజండా మొదటికిదారి చెప్పుచు నడిపించును. పిక్కలుపీకి యిక్కడకు చేరిన నేమున్నది ! వట్టిచిదంబరరహస్యము. అచ్చటమున్ను తప్ప మరి యేమియు లేదు.

ఇచ్చటనుండి కొంతదూరముపోయి కర్రసోపానములనెక్కి గోడపై భాగమునగట్టిన కర్రవంతెనపైనడచి యవ్వల దిగితిమా యంతరిక్షమార్గమున నొకచిన్నదోనెనుంచి దానిలో మనుష్యులనెక్కించి యటనుండి యేటవాలుగనమ

శ్మీరవాసులు,పంజాబీలు,సైంధవులు,రాజపుత్రులు,పారశీలు, మహారాష్ట్రులు,మార్వాడీలు, గుజరాతీలు, బంగాళీలు తురకలు, కన్నడులు, ద్రావిడులు నాంధ్రులు, మళయాళీలు, మున్నగు హిందూదేశవాసులందరు నొక్కచోగూడి యొకరినంగతినొకరు దెలుసుకొనుటకు నన్యదేశీయులయభివృద్ధిని కన్నులార చూచుటకునుగూడ నవకాశముగలదు. ఈయన్యోన్య సందర్శనలాభమిప్పుడు మనకత్యంతావసరము. ఇట్టివారందరును పూర్వము బత్తిసాయుధములధరించి యన్యోన్యవధకై యుద్ధరంగముల తారసిల్లుచుండెడ్డియవస్థకు మారుగ నిప్పుడీరంగస్థలమున చేతిపనులంనును వృత్తులంనును వాణిజ్యమందు నొకరి నొకరోడించుటకు కడుపులోనిపాలు గదలకుండ కదనమొనరించునవకాశముగలిగినది. నరహత్యలును దోపిడులునడుగంటినవి నెమ్మది దేశమంతటను వ్యాపించినది.

మానవ విరచితములగు వింతలజూచి సంతసించుచున్న నెక్కువది యింకొక్కటిగలదు. ఈబొంబయిసభకు వన్నె హెచ్చించినది దీనియందలి స్త్రీరత్నములనుటకే సందియమునులేదు. స్త్రీల భాగమొకటి ప్రత్యేకముగ హిందూసుందరులచే చేయబడినపనుల కేర్పరుపబడినది. దీనిరమణీయతనెంతనివర్ణింతుము. ఎటుదిరిగిచూచిన సాధగద్ధగితములగుచీరలునురల్లికపనులును పటములునుబొమ్మలును కు

చిన్న వస్తువులు నీటినన్నిటి నొకచోట గూర్చి తీర్చి సవరించు
టచే నఖండగరిమదనరి పలుజాతులవిలువయు లాఘవమును
ప్రయోగమును పెంపుజెందును. సభయందలి విధములయి
రుతునుండి వెలివడియుంటగూర్చుండి యీవస్తుసంతానము
నుగూర్చి యోచింపయోచింప దరిద్రదశకు వచ్చియున్న
మనదేశమునకు శుభగ్రహముల మహాదశసగ్గరనున్నదని
స్పష్టమగును. ఇదిపనివాండ్రపండువుగాక మరేమి? ఇట్టిమ
హాస్థలసందర్శనముచే సపసమ్మికయసూయత్వకృత్రిమము
దురహంకారము మున్నగుదోషములురహితములై సోదర
భావమును అన్యోన్యానుకూల్యతయు ధారాళమగు వృ
త్తియు నీతియందుదృష్టియు మున్నగుసద్గుణములు జనించి
ఆసేతు హిమాచల నివాసులకు కృషివ్యాపారములం
దును శాస్త్రీజన్య జ్ఞానమందును విద్యా వృద్ధియందును
పదార్థసమృద్ధియందు నత్యంతాసక్తి పుట్టి యేకకుటుంబ
మాగ తామునిలిచియై నర్థిల్లు భాగ్యముగలుగును. అన్యో
న్యవైరములతో శాఖోపశాఖలుగ పగిలి బంధువులలో
బంధువులై నను కలసి భుజించకుండునంతటి మోటిమొ
త్తైన మనము జీవించుచున్నామన్న దానుమనకు గలదు.
ఇట్టిసభలును ధర్మశాలలును మనవారిసంఘములును
దేశయాత్రలునుసాగినకొలది క్రమక్రమముగనట్టిమార్పుతో
లగును.

ఏనాడు రాజులును రెడ్లును సామంతులును కాపులును తారతమ్యములుమరచి భ్రాతృభావముతో దివ్యభవనముల సంతుష్టాంతరంగులయి యానందముగజరించిరి!!

రాజ్యాంగవిషయముల విచారించు కాంగ్రసు సభను కొంచెమటుండనిండు. పరిపాలనాకర్తవ్యములను గూర్చి కొందరు తెలివితోడను మఱికొందరు తెలివితక్కువగను వితర్కించుచుండ కోటానకోటులగు ప్రజలు తమకుగల తెలివితేటలతో రాత్రిందివములు పాటుపడుచు పేరుప్రతిష్ఠలకాసపడక చప్పుడుచేయక గుట్టుగాబ్రదికి దేశముయొక్క సుఖజీవనమునకై పాటుపడి ధన్యులగుచుండు వారికి పరపతియును గౌరవమును గలుగుచుండ, నట్టివారు లేకున్న దేహయాత్రదుర్ఘటమై కాముస్వయముగ జీవనముచేయున సమర్థులగు ప్రబుద్ధులు కాయలుగాసిన చేతులనిరసింపుచు తమతోడిదలోకముని స్వశక్తియించుకయులేక పుట్టుకవలననో యదృష్టముచేతనో యన్యాయముగానో ధనమార్జించి దానిని దేశాభిమానముతో యంతారిను లందు వినియోగింపక దంభవ్రతులై యున్నతరాజకీయోద్యోగులసంతసింపజేయుటకు వేలకొలది వెచ్చించి వ్యర్థములగు కితాబులబడసి ధన్యులమనుకొను నిర్గంధ కుసుమములకు గౌరవముతప్పుచున్నది. దేశాభిమానముతో పనిచేయుకష్టజీవులకే గౌరవమునుసుఖమునుగలుగుచున్నది. వృత్తులకు

ర్చిన పలకలవెంటజారవిడుతురు. అదివాయువేగమునజారి భూమిపైనమర్చిన యొకతోనేరున శరవేగమునగుభిల్లనికూలును. ఆదెబ్బతాకుడుచే పెద్దకెరటములేచి యాకెరటముతోనదోనెయును పైకెగసిపడుచుండును. ఈవినోదముననుభవించుట కెనిమిదియణాలు సుంకముపుచ్చుకొందురు. ఈ యొక్కవినోదమువలననే రు 17000లు పోగయినవి మనవార నేకులీ వినోదమును దూరమునుండిచూచి యానందించిరిగాని పడవనెక్కుటకు సాహసింపజాలరైరి పారసీలును యూరోపియనులును యూరేషియనులును స్త్రీలు పిల్లలుగూడ దీనినెక్కి చప్పటులుగొట్టి కేరినవ్వుచు నీటబడిగట్టునకు దుముకుచుండిరి. మనవారిలో ననేకులకింకను శక్తిసాహసములు పెంపొందవలసియున్నవి.

వినోదములవిడచి యితరవిశేషములకొంత విచారింతము. చేతితోగాని యల్లుటకు వీలులేదనుకొను లతలును పుష్పములును వస్త్రములపై కుట్టుయంత్రములును, యంత్రసాధనమున చేయబడిన యసాధ్యపుపనులును వేలకొలది విలువగలబండ్లును, వింతవింతలగుపనిముట్లును పరిశీలించిచూచి నప్పుడుగాని రక్కసిబొగ్గును యినుమును మానవులదశ నెట్లు పెంపుచెందింపగలవో తెలిసికొనజాలము. యంత్రములమహిమ యేమనవచ్చుసృష్టికిప్రతిసృష్టి గల్పించునుగదా ! నీటియావిరి మునుపటివలె మిన్నదియిచ్చు

కువచ్చినట్లు గంతులువేయక యినుపనాళముల యందడగి మడగి మానవులకు దాస్యముచేయుచున్నది. దానివలననిలాభము మనము పొందువరకును దేశమునకు లాభము కలుగనేరదు.

పనిముట్లనువిడిచి వాటిసహాయమునచేయబడిన పనులనుచూతము శృంగారప్రతిమలంతను చిత్రపటములంతును నింపబడియుండు గొప్పయూహాలును ఘనముగ రూపములునుగాంకున్న మానవులకు సులభముగ విద్య గరపుగురువులేవరు. నవరసములు నుట్టిపడునట్లు పాత్రప్రతిష్ఠకై యెదురుచూచుచున్నట్టి ప్రతిమలు మనమనస్సునందెంత్తిమంచియూహాల నెలకొలుపగలవ్రో యనుభవముగలవారికి తెలియును. వలదువలదనుకొనుచునే యింతదూరము వ్రాసితిమి. ఇకమనమును మగులుగొల్పునీసభనుండి బయటకు బలాత్కారముగ తెత్తము

బయటకు వచ్చినంతమాత్రమున నచ్చటగన్న విమరపునకువచ్చునా? కావు దినమంతయు సభావినోదములందును విచిత్రవస్తుసముదయమునందును గడపి యింటికివచ్చిన వెనుక మనసింకను పనిచేయుచునేయుండును. అవ్యక్తమాగునౌన్నత్యమును సౌందర్యమును మనమంతయునిండితాగన్న నానావిధవస్తుసంచయముయొక్క. మంచిచెడ్డల నిరూపింపజాలకుండును. ఈప్రదర్శనమును వేరువేరుగజూచినచిన్న

గౌరవముగలిగినప్పుడు వాటిపోషణకు కావలసినసాధనసా
మగ్రికి వెలపెచ్చకపోదు. మనలోకోత్తరములగు పర్వ
తములును ఘనతరులచే ప్రబలియున్న యరణ్యములును జీవ
నాధారములగునదులును ఖనిజములతో నిండియున్న గనులు
నుసారముతో నిండియున్న క్షేత్రములును పనిచేయబూనిన నె
ట్టివస్తువులనైన నొసంగజాలియున్నయవి. గనిలోని బంగార
మువలెనడగియున్న మనవారి శక్తియుక్తులు బయలుబడకుం
డుటచేనన్యదేశీయులు మనవలనలాభము దీయుచున్నారు మ
నమేనిద్రమేల్కొనిన యేదేశము కట్టుబట్టలను కుట్టుసూదు
లును పెట్టుదీపములును మనదేశములోనికి దిగుమతిచేయ
సాహసించును.

ప్రజలదృష్టి యిటుతిరిగినటులనే ప్రభుత్వము వారి దృ
ష్టిగూడ యిటుదిరిగినదిగాని ఇప్పటివరకింకను చెప్పకొన
వలసినంతమేలు ప్రభుత్వము వారు చేయకున్నను మనయ
త్నములకు విఘ్నము చేయరు. అందుచేతనే బొంబయిలో ఎగ్జి
బిషనుసభను బొంబయిగవర్నరుగారగు లార్డు లెమింగ్టన్
ప్రభువు వారాధ్వర్యము వహించి యాదరించిరి. ఇట్టిసభ
లకుపోయి చూచుచుండుట దేశాభిమానులకందరకును
విధి. ఈసంవత్సరము డిశంబరునెలలో కాశికాపురియం
దు కాంగ్రెసుతోగూడ యీసభ జరుగును తీర్థమును సార్థ
మునుగూడ కలసివచ్చునుగాన అవకాశముగలవారెల్లరును
యాత్రచేసి పావనులగుదురని నమ్ముచున్నాము

# ఆర్యప్రభావము.

## 8 వ ప్రకరణము




పన్యాసములవలనను గ్రంథములవలనను దేశయాత్రలవలనను ఎగ్సిబిషనులవలనను దేశాభివృద్ధికి మార్గములు తెలిసి జ్ఞానాభివృద్ధి కలుగునని వ్రాసియుంటిమి. కాని, వినియోగమునకు రానివిద్య పచనముకానివంటకము వలెనే యనుభవమునకు రాకుండును. చేతులనుచాచి కాళ్ళుతన్నిన నీటిలో తేలి యీదవచ్చునని వినియు జదివియు నన్యులీదుచుండఁగనియు తానునీటఁ దిగి కొట్టుకొని మునకలిడి మధ్యమధ్య గుక్కెడు నీళ్ళు త్రావుచు పెనుగులాడి స్వయముగా పనిచేసినగాని తనకీత రానేరదు. ఆప్రకారముగనే యెంతచదివినను నెన్ని జూచినను స్వయముగా పనినవలంబించి కష్టసుఖములకోర్చి పాటుపడనారంభించినగాని తనకంతవలన లాభమేమియులేదు. గాన దేశాభిమానులు సాహసముతోడను ధైర్యముతోడ నొక్కొకవృత్తియందుదిగి యొక్కొకయం

ప్రశాలనుస్థాపించి, యొక్కటకకృషి నవలంబించి దానిను ధరించుటకు పూనికతో పనిచేయవలయును. ఆవిధము గా పనిచేయునపుడు, జ్ఞానహీనులును, దుర్బుద్ధులునగువా రి యుద్యమములకు గలుగజేయు విఘ్నములకును, ప్రచురించునిందలకును, జంకక "సత్యమేవజయతి నానృతమ్" యనునీతిని మనమునబూని పనిచేయుచుండినపక్షమున నట్టివారియపకృతులు నిష్ఫలముగాక తమయత్నలత పుష్పించి ఫలించును.

సర్వసముడును, దయామయుడును నగు భగవంతుని నిందిం చునంతటివారుండ, కేవలమనుజమాత్రులు తాము యోగ్యులైనంతమాత్రమున కుబుద్ధుల దుర్వాదముకలయొక్కయు, కుతంత్రములయొక్కయు బారినుండితప్పి బ్రతుకుదుమనుకొనుట వెట్టితనము. దూషించువారి దూషణలకును భూషించు వారి భూషణలకును గూడ లక్ష్య పెట్టక విధ్యుక్తములను జేయుచుండువాడే ధన్యుడు. వాని దేయానందము. వానివలననే దేశమునకులాభము. కాలక్రమమున నిరర్థకజన్ములుతమదశను దలచుకొనిపశ్చాత్తప్తులై మంచిమార్గమునకు వత్తురనిమానమ్మిక. ఇట్టియరిష్టములన్నియును గడచిగట్టెక్కి దేశమంతటను యంత్రశాలలును చేతివృత్తులును కలసిన నాశూవానియందు తయారుచేయబడిన వస్తువులను లోకమునకువెల్లడిపరచిన

గాని గొనువారుండరు. గొప్పవారును ధనాధికులును గౌరవమైనషాపులకేగి వస్తువులనుగొందురుగాని చిల్లరదుకాణములకుపోరు. అందుచే తయారుచేయబడిన వస్తువులు గౌరవమైన షాపులయందమ్మబడినంగాని వర్తకునకు లాభము లేదు. మనదేశములో సాధారణసంసారులు తమకుటుంబములయందలవాటుపడిన వస్తువులనే కొనుచుందురుగాని క్రొత్తక్రొత్తవస్తువులను వినియోగించుటకుహార్షింపరు. మొదటసంసారిపక్షమునుండు వారికికావలసినవస్తువులేకొద్దివి క్రొత్తవస్తువులను ధనాధికులే యాదరింపవలయు నట్టివారువానిని కొనియుపయోగించుచుండగొంత కాలమునకు దక్కువ సంసారులుగూడ వానికలవాటుపడుదురు. అంతవరకువచ్చియావస్తువులువిరివిగవాడబడునప్పుడుతనకునష్టములేకుండ దానివెలతగ్గించుటకు వర్తకునకవకాశముకలుగును. కొనువారిదృష్టిక్రొత్తవస్తువులపైపుట్టిప్పుటకు రెండుమార్గములుకలవు. వార్తాపత్రికలందువానింగూర్చిప్రచురించుటయొకమార్గము, 1901 సంవత్సరముంక్సిబిషనుసభకు సెక్రటరీగానుండిన ఆక్సుఫర్డుయూనివర్సిటీ మాస్టరు ఆఫ్ అర్ట్సును బారిస్టరు అట్ లాయునునగు జే. చౌదరీగారు మున్నగువారిచే దేశాభివృద్ధికై స్థాపింపబడిన "ఇండియన్ స్టోర్సు లిమిటెడ్" వంటి కంపెనీలకుపంపి యచ్చుటనమ్ముట రెండవది. మన్నారీలవలె మూటచంకనువేసి

కాని యింటింటదిరుగుటవలన ప్రతిష్ఠ ప్రయోజనములుకలుగవు మంచివాడుకతేవప్పుడు వస్తువయొక్కగుణదోషములను విచారించుబుద్ధిసాధారణముగా నెవ్వరికినిబుట్టదు.

ఇవియన్నియునిట్లుండ నెట్టిమంచివస్తువైనను దర్శనీయముగాకుండవియెడల దానికిపరపతికలుగదు. హిందూదేశపు అగ్గిపెట్టెలలోనుస్వీడను, ఆస్ట్రియా,జపాను దేశములోని యగ్గిపెట్టెలలోను నిప్పుకరీతిగానేయున్నను వానియందే పెట్టెలు ముద్దుగానుండునో వానినే మనముకొందుముగాని కన్నులకింపుపుట్టింపని నిప్పుపెట్టెలనుకొనుటకుమనసురాదు. జిహ్వాకురుచి పుట్టించునట్టియు దేహమున కారోగ్య దాయకమగునట్టియు పానకములును పొడులునుతేయాకుచేసి తమపిల్లవానికి "మెల్లిన్సుఫూడ్డు" ఖర్చుపెట్టగా మిగిలినవట్టిబుడ్డిలోబోసి మూతవేసి దానిపైలక్కకరగించిపోసి దానినమ్మజూపిన, వస్తువునకును దానినిమ్మువానికినిగూడ గౌరవముతగ్గిపోవును. మనదేశపువర్తకులలోననేకులకు వస్తువులను చక్కగా బంగీ (Packing)చేయుటయే తెలియదు. ఎడ్డెతనముగా నున్నవస్తులను ముట్టుటకైనను మనస్సొల్లదు.

జాయంటు స్టాకుకంపెనీలేర్పరచియంత్రశాలలు స్థాపించి సుఖజీవనమునకు నానందమునకును వలయువస్తువుల సమృద్ధిగ తయారుచేసి వానినితగిన వెలకమ్ముటయున్నగు

పనులకు మనపూర్వుల వేదశాస్త్రములును, పురాణములును, భగవద్గీతలును, ఉపనిషత్తులునంతగా సహాకారులు కానేరవు. వానివలనగలయుపయోగము నైహిక వ్యాపారములయందు వానియావశ్యకతయు నీప్రకరణాంతమునందు జెప్పబడును లోకములో ప్రకృతిశాస్త్రములకును యంత్రశాస్త్రములకును పెంపుగలిగించి జనసామాన్యమునకు వీనియందుజ్ఞానాభివృద్ధిని కలుగజేయునది ముద్రాక్షరయంత్రము. వ్రాతగ్రంథములసంఖ్య బహుకొద్దిగానుండవలసి వచ్చుటవలన వాని లోకవ్యాప్తికవకాశము లేకయుండె నెక్కడనో కొద్దిమంది విద్యనేర్చినవారక్కడక్కడ నుండుటచే వారియూహాలు సులభముగ గ్రహించియుండు పైవృద్ధిని చూపుట కవకాశము పూర్వకాలమున లేకుండెను. ఇప్పుడు రెండు మూడు వందల సంవత్సరములలో ముద్రాక్షర యంత్రమహిమచే సరస్వతిముద్రితగ్రంథావతారమెత్తి వారువీరనక నెల్లరకును జ్ఞానోపదేశము చేయుచున్నది. ఇట్టి జ్ఞానోపదేశము కలిగినవెనుక నైహిక సుఖమునకు నాధారములైన సమస్తవస్తువులను తయారుచేయు యంత్రముల నంతకంతకభివృద్ధినొందించి మార్చుచుండుట కవకాశము కలుగుచున్నది. అట్టి యంత్రాభివృద్ధి కలిగినకొలఁదిని నైశ్వర్యాభివృద్ధి దాని వెంటనే పరువిడుచు వచ్చును. ఇట్లని ధనాభివృద్ధియే

ప్రధానముగా జేసికొని యేవిధమునైనను ధనార్జనము కన్న యర్వాకృత్యము వేరొకటిలేదని ధనము కుప్పతిప్ప లుగా ప్రోవుచేసిన రక్తనాళములయందు నెత్తురెక్కువ యైనప్పుడు దేహమునకు బాధయెటులకలుగునో యటుల నే దేశమునకు ముప్పుకలుగును. అధికధనము సంపాదించి ధనార్జనముయొక్క ముఖ్యోద్దేశమును మఱచి వర్తించు చునెడ భోగక్రీడాపరాయణులై ప్రజలు నశింతురనుట క దివరకట్టిదశకువచ్చి యడుగంటిన దేశములే సాక్షీభూత ములు.

నడమంతరపుసిరినరము మీాదవేయు రాచపుండువంటిది ఏదేశమందు ప్రజలుకష్టపడి చెమ్మటయూడ్చి చాకిరిచేసి దానికిఫలముగ సుఖమనుభవించుచు స్వతంత్రముగజీవిం చుచుందురో యదియెసంపన్నమగు దేశము. ఎప్పుడు కడ జాతులవారికి స్వతంత్రవృత్తివలన జీవించుశక్తిసాధనము లుగలుగునో యప్పుడువారు పైజాతులవారికి దాసులై యుండవలసినగతితప్పి తమ స్వాతంత్ర్యములకు భంగము కలుగజేయుయత్నములను కొనసాగనీకుండుటకు సమర్థుల గుదురు. ఇట్టియవస్థమునలను పరిపాలించుచున్న యాంగ్లే యులదేశమందు కలిగినతరువాతనే ప్రజలస్వాతంత్ర్యము లకును, వృత్తులకును వ్యాపారములకును పెంపుగలిగివర్ధి లుచున్నవి. మనదేశమునకు ముద్రాక్షర యంత్రము

లాంగ్లేయ ప్రభుత్వము వెంట దిగిన వెనుకనయిన నాయంత్రములవల నపొందవలసినలాభము జనసామాన్య మింకను పొందుటలేదు. పురాణములు, ప్రబంధములు, వ్రతకల్పములు, పిట్టకథలు, మొదలగుగ్రంథములే దేశభాషలయందు. ముద్రింపబడుచుండుటచేనవి మనయవసరములకుపయోగపడకున్నవి. లోహములను కరగుటనుగూర్చియు కత్తులను చెక్కుటనుగూర్చియు, వస్తువులను తయారుచేయుటనుగూర్చియు, యంత్రములను వివరించుటను గూర్చియు, పనిముట్లు యుపయోగములను గూర్చియు గనులుకనిపెట్టుటను గూర్చియు, వానిని త్రవ్వుటనుగూర్చియు, మున్నగు విషయకగ్రంథము లేవియును మనలో లేవు సరియేగదా యన్యభాషలలోనివాటినాంధ్రీకరించుటకైననిదివరకుమనలో ప్రయత్నమెవ్వరును జేయకుండుటచే నెవ్వఁడుచదివినను వట్టిసాహిత్యానుకూలగ్రంథములనగుట వలన పనివాండ్ర బుద్ధికివికాసము కలుగకున్నయది.

పట్టణములయందును పల్లెలయందునుండెడు వృత్తులు వృద్ధినొందుటకు వీలుగలుగుపనులను చేయవలయునుగాని ధనాకర్షణమే ప్రధానముగాచేసికొని దేశమునసొకములకు ధనముకుప్పతిప్పలుగా ప్రవహించిపోవు ప్రయత్నము వలన లాభమెంతమాత్రమునులేదు.

జనసామాన్యమునకందఱికిని హితమై యవసరమై లాభకరమైన వృత్తులను పెంపుజెందించు విద్యలున్ను పనులు నుజేయుటకే దేశాభిమానులందఱును ప్రయత్నింపవలయును. మనము క్రొత్తగాఁ దేదలఁచిన వానిలో కొన్ని మనదేశప్రజామనమునకు వ్యగ్రముగనుండును. వానియందేదో యొకవిధమగు నసహ్యత మనములందు జనించియుండి హేతువులచే నెంతప్రోత్సాహపరచినను తిరుగకమాఢ్యమువహించియుండినయెడల వారిని భయపెట్టియో బలాత్కారముగనో మనముతలచిన పనికెన్నడును దింపరాదు. ప్రజలమనములు నొవ్వకుండ సనీతినివిడువక వారికి హితమైనదారిన మెల్లమెల్లగ మార్గమును జూపుచు కాలక్రమముననట్టి దురూహాలు పోగొట్టవలయును.

గీ. మాలకరిపుష్పములుగోయుకనూడ్కి తేటి।
పువ్వు తేనియగ్రోలెడుకపోల్కి నెమురు।
గందకుండగనాసుసదికి కార్యఫలము।
బొగ్గులకు బోలె మొదలంటకబొమవజనదు॥

అనుభారతనీతిని మనము సంపంచి దేశక్షేమలాభములకై మనము యత్నించుచున్నాముగదా, ఎవ్వరేమనుకొనిననేమియని లోకకంటకుడై వ్యవహరించుచున్నయెడ త్రాడుబచుకొన్న మేలునుచేయుట యెవ్వరికినిమస్తరము.

సద్విద్యాభివృద్ధియు, ధనసమృద్ధియు కలుగుమార్గములు కర్తవ్యములనియు అందుకై దేశాభిమానులెల్లరు నుపూని పనిచేయవలయుననియును ఈగ్రంథ ముపదేశించుచున్నదిగదా, అట్టివిద్యను ధనమును సద్వినియోగము చేయుచున్న దేశము బాగుపడుటకు మారుగా వినాశమొందునని పదేపదే వ్రాయనవసరము లేదు.

క. ధనమును విద్యయు వంశం
బును దుర్జనులకు మదంబుఁ బొనరించును స
జ్జనులైన వారికడకున
యును విద్యయ తెచ్చుచుండు నుర్వీనాథా!

యనిచెప్పబడిన రీతియందుగల నిజము మనము ప్రతిదినమును మనకన్నులయెదుటనే చూచుచున్నాము. కోతిచేతనిడిన కోఅవివలె దుర్మార్గునిచేతిధనము తన్ను లోకముం గూడ పీడించుటకే వినియోగపడును. అట్టివానికి ధనముకన్న దారిద్ర్యమే శ్రేయోదాయకము. కలధనమును న్యాయమార్గమందు వినియోగపరచుటకు భగవద్భక్తియు లోకానుభవమును కావలయును. అట్టిభక్తిని లోకానుభవమునకు నాముష్మికసాధనములగు నుత్తమగ్రంథములు సాధనములు.

మన వేదములు నుపనిషత్తులు మున్నగు మతగ్రంథములందుగలసారము నన్యాయము నగ్రహించి జనసామాన్యము న

తప్పుదారినుండితమనడవడిచేతను, హితబోధచేతను, త్రిప్ప జాలిన పండితోత్తములు బయలుదేరి యిప్పుడు దేశము న్నావహించియున్న యజ్ఞానాంధకారమును తొలగించవల యును. ఇప్పుడున్న వైదికులలో ముక్కాలు మువ్వీసమున కు వేదవాసనయేలేదు. పండితులనువారికి సాహిత్యజ్ఞాన మొంతకలిగియున్నను, లోకానుభవముకలుగుటకు తగినవి ద్యవారికిలేదు. ఆంగ్లేయభాషాసంస్కారము గలిగియుండి సంస్కృతమునందు ప్రవీణులై యోగ్యులైనవారీ కార్య మునకు పూనుకొనవలయును. అందుకు సమర్థులైనవారు అక్కడక్కడ బయలువెడలి పనిచేయుచున్నారు. అందు చే కొద్దికాలములోనే మతోద్ధారణముగలిగి ప్రజలట్టివా రిని యాచార్యులుగా గ్రహించకమానరు. అట్టిసరువు లే ర్పడినప్పుడు విద్యాధనములను సద్వినియోగము చేయుగు ణము వాటిని కలిగియున్నవారికి జనించి, వానిదుర్వి నియోగము చేయబోవువారువిరసులై సంఘముచే శాసిం పబడుచుండురు.

దేశము సంపద్భరితమైయున్నదన్నంతమాత్రమున పేద లుండరనుకొనవీలులేదు. దేశమందున్న ధనమందరికినిసమ ముగాపంచియిడినను పలువిధహేతువులచే స్వల్పకాలము లోనే ఆధనమునకు వ్యత్యాసముకలుగకమానదు. అందు చేధనవంతులగునవారు చేయవలసినపని పేదలకుతమధ

ములవలన సుఖజీవనముకలుగజేసి వారి నుద్ధరించుచుండుటయులోకహితములగు ధర్మములందును, దానములందును దేశాభివృద్ధికి సాధనములగు కార్యములయందును తమకుగల యైశ్వర్యమును వినియోగపరుచుటయునై యున్నవి మనలో జనసామాన్యమునకు ధర్మగుణము సహజముగనేన్నయది కాని అట్టిగుణమునువినియోగించి తోటివారికినితమకును మేలుసమకూర్చి తరించుమార్గములు ప్రస్తుతలోకావసరములైనవి వారికిచూపవలయును.

యంత్రశాలాభివృద్ధివైపుదృష్టిత్రిప్పి స్వదేశరచితపదార్థములను గౌరవించియాదరించు గుణమునకెల్ల పలువిధములైనహేతువులు సమకూడినవియో యీరీతినే యీయార్యభూమియందు స్వమతాభిమానము నైకమత్యభావమును పెంపుజెందుటకు సాధనములును దేశమంతటను బయలువెడలుచున్నవి. సర్వరక్షకుడైన యీశ్వరునిమరువక సంపదను పెంపుజెందించుచున్నంతవరకును దేశమునకు శ్రేయోభివృద్ధి యఖండముగగలుగుచుండును.

ఆవిరియంత్రములచేతను తైలయంత్రములచేతను తటిత్ప్రభాయంత్రములచేతను పనిచేయు యంత్రశాలలు పలువిధములైనవి స్వదేశధనముతో నేర్పరుపబడి పనిచేయుచున్నవి. మరికొన్ని తయారగుచున్నవి. ఇంకనెన్నియో స్థాపించుటకు ప్రయత్నములుజరుగుచున్నవి. దీనిని

పట్టి చూచినంత మాత్రమువనె శుభదినము లిదివరకే ప్రారంభమైనవని తెలుసుకొనుటకును స్వల్పకాలములోనే యంత్రశాలాదుల నలుదెసలును నెలకొలుపుటకు దేశాభిమానులు చేయుయత్నముల కేయనుమానమును లేక యెల్లరును తోడ్పడుచుండుటకు నేసందియమును పడ వలసిన యవసరములేదు పైన చెప్పినరీతి సద్విద్యయు దైవభక్తియు బొడమినప్పుడు మనలపీడించుచున్న పేదరికము తొలగిపోవుట నిశ్చయము. గర్వాదిదుర్గుణములు విద్యాధనములవలన మూర్ఖులకు కలుగునని యిదివరలో చెప్పబడినది. సద్విద్యవలన నిదివరకు చెప్పినయడకువమాత్రమేగాక సకలసుగుణములు గలుగును.

గీ. విద్యయొసగును వినయంబు వినయమునను।
బడయు పాత్రత పాత్రతవలనధనము।
ధనమువలనను ధర్మంబు దానివలన।
నైహికాముష్మికసుఖమ్ములందునరుడు॥

(చిన్నసూరి)

విద్యావినయసంపన్నునకు పాత్రతగలుగుటచే వానికి ఫలముగ ధనముగలుగును. అట్టివాడు ధనమునుతప్పక సద్వినియోగము చేయుచు నట్టి వినియోగమువలన మోహాపంకిలమగు జనలోకమును దాటి ప్రజాసౌధము నెక్కి యా

వందించుచుండును, అదృష్టవంతుడు దాపట్టినదెల్ల బంగారమగుచున్నంతమాత్రమున స్వశక్తిసాధనముల చేతనే యటుకలుగుచున్నదని యనుకొనజాలడు,

గీ. సారమతిబరికింపంగఁబౌరుషంబు।
గంటె దైవంబుముఖ్యంబుగాఁగార్యసిద్ధి।
కెచటనేనియుఁబౌరుషమునకమునఁగె।
నేనియది దైవదత్తంబుఁయుంతనిజము॥

(భారతము--శాంతిపర్వము)

దేశమున గల యైశ్వర్యమునకు నౌన్నత్యమునకు ను పురుషప్రయత్నము ముఖ్యముగాని యవిలభించి వృద్ధినొందుటకు దైవబలమే ప్రధానమను నుత్తమనీతినెన్నడునుమరువక కాలమువృధాచేయక తరిదప్పివ్యవసాయకృషికి దిగినవానివలెగాక వర్షముపడి నేలపదునుపడినప్పుడు చాలునకుదిగి దున్నుచు నడుమనొకవింతజూచి భ్రమసియో లేనిపోనికయ్యములకు కాల్దువ్వియో మేడితోకవిడచి తడియారి భూమిబిగిసినప్పుడు దానింబగులగొట్టుటకు తన్నుకొనక వర్తమానకాలవిధులను పూనికతో చేయుటకే యత్నింపుచుండుడని స్వదేశవాసులగు మిత్రులహెచ్చరించుచు నీగ్రంథముముగించుచున్నాను.